శ్రీ శ్రీ

సినిమా పాటలు

# విశాలాంధ్రలో ప్రజారాజ్యం

సంకలనం:

సరోజా శ్రీ శ్రీ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Visalandhralo Praja Rajyam - Sri Sri Cine Songs
Compiled By: Saroja Sri Sri

ప్రచురణ నెం. : 2134

ప్రతులు : 2000

ప్రథమ ముద్రణ : మే, 1999



వెల: రూ.20-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్: 3229831

# అంకితం

నాకు తల్లి దండ్రులూ
మహాకవికి అత్త మామలూ అయిన
శ్రీ ఉపద్రష్ట సూర్యనారాయణ
శ్రీమతి సీతారామమ్మలకి...

- సరోజా శ్రీ శ్రీ

# నా మాట

శ్రీ శ్రీ తన కోరిక ప్రకారం - తను సినిమాలకోసం రాసిన పాటలన్నీ "శ్రీ శ్రీ ప్రచురణల కిందే" ప్రచురించాలని ఆశించారు. అలాగే శ్రీ స్వాతి బలరామ్‌గారి సహకారంతో 1983 ఫిబ్రవరిలో మొదటి పుస్తకాన్ని "పాడవోయి భారతీయుడా" పేరుతో విడుదల చేశారు. మిగిలిన వాటిని వెయ్యకుండానే 1983లోనే మరణించారు. కొన్ని సంవత్సరాలు మానసిక ఆర్థిక ఇబ్బందుల వల్ల నేను వెయ్యలేక పోయాను. చివరికి "విశాలాంధ్ర వారూ, ఆ సంస్థ మేనేజర్ శ్రీ పి. రాజేశ్వరరావు గారి సహకార ప్రోత్సాహాలతో - శ్రీ శ్రీ రాసిన పాటల్ని" నాకు దొరికినంత వరకూ సంపుటాలుగా తీసుకు రావాలనుకున్నాను. అలాగే 1996 ఆగష్టులో "తెలుగు వీర లేవరా" పేరుతో 2వ సంపుటాన్ని విడుదల చేశాం. ఇప్పుడు (3) విశాలాంధ్రలో ప్రజారాజ్యం (4) ఉక్కు పిడికిలి (5) అగ్నిజ్వాల (6) అరుణ పతాకం (7) ఖబడ్దార్ సంఘ శత్రువులారా అన్న పేర్లతో మిగిలిన పాటల్ని 3, 4, 5, 6, 7 సంపుటాలుగా విడుదల చేస్తున్నాం. ఇందులో నా ప్రత్యేకత ఏమీ లేదు. అన్నీ ఆ మహాకవి రాసినవే. పోతే అవి సేకరించటానికి, చాలా కష్టపడాల్సి వచ్చింది. అయినా కొందరు - శ్రీ శ్రీ రాయని పాటల్ని వేస్తున్నానని చాలా నిరుత్సాహ పరుస్తున్నారు. శ్రీ శ్రీ అన్నట్లు - మహామహులే దూడేస్తుంటారు. నేనో లెఖ్ఖా. అయినా జాగ్రత్త పడుతున్నాను. శ్రీ శ్రీ స్వ దస్తూరితో సినిమాల్లో వచ్చినవీ రానివీ వారు తనకోసం రాసుకున్నవీ, నాదగ్గర వుండ బట్టే వాటిని ఆధారంగా పెట్టుకుని, ధైర్యంతో వెయ్యగలుగుతున్నాను. ఇక సేకరించిన పాటల్లోనే పొరపాట్లు వుండొచ్చు. అలా పొరపాటుంటే నన్ను క్షమించండి. నా

పొరపాటును – ఉత్తరం ద్వారా "సరోజా శ్రీశ్రీ, శ్రీరంగ నిలయం 2/1, సౌత్ బ్యాంక్ రోడ్, మందవల్లి, మద్రాసు–600 028." అనే అడ్రస్సుకి తెలియచెయ్యండి. పొరపాట్లను దిద్దుకుంటాను. దాంతోపాటు శ్రీశ్రీ పాటలు ఇంకా – మీ దగ్గరుంటే నాకు పంపి సహకరించండి. ఈ మాట నేను నాడే మా అభిమానులకూ, మిత్రులకూ, పాఠకులకూ, మనవి చేసుకున్నాను. నాడే కాదు, నేడు ఈనాడు ఏనాడూ, మీ అందరి సహకార ప్రోత్సాహాల్ని కోరుతూనేవున్నాను. మరొక మాట – నాకు లభ్యమైన పాటలలో వివరాలు – అంటే కంపెనీ పేర్లూ, సంగీత దర్శకులపేర్లూ, పాడిన వారి పేర్లు కొన్నిటికి దొరకలేదు. అయినా ముందు, శ్రీశ్రీ సినిమా పాటల సాహిత్యాన్ని కూడా పుస్తక రూపంలో తీసుకురావాలన్న ఒకే అభిప్రాయంతో ముందడుగు వేశాను. 2వ సారి ముద్రణ జరిగేటప్పటికి పూర్తి వివరాలు సేకరించటానికి ప్రయత్నిస్తాను. నా ఈ తప్పును మన్నించ కోరుతున్నాను.

ఈ పుస్తకాన్ని మీకందిస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి కృతజ్ఞతలు తెలియచేస్తూ – నా తప్పొ ఒప్పుల్ని మన్నించాల్సిందిగా మరొకసారి మనవి చేస్తూ సెలవు తీసుకుంటున్న మీ శ్రీశ్రీ భార్య

సరోజా శ్రీశ్రీ

# ఇదీ వరస...

★ ★ ★

# ప్రజారాజ్యమే స్థాపించాలి

పల్లవి: ప్రజారాజ్యమే స్థాపించాలి
ప్రజా బలాన్నే చూపించాలి
ప్రభువులు కారు – ధనికులు కారు
కండ బలంతో, కొండలు పిండే
ప్రజలే సర్కారు – వారికి ఎవరూ సరికారు॥ప్రజారాజ్యమే॥

అనుపల్లవి: ఎవరో చేసే సాయంకోసం
ఎదురు చూడటం పిచ్చితనం
గమ్యం చేరగ కార్మికవర్గపు
ఐకమత్యమే – మూలధనం ॥ప్రజారాజ్యమే॥

1వ చరణం: చిన్న చిన్న చినుకులే మహాప్రళయమై
గర్జిస్తాయని చాటించే – ప్రజలే సర్కారు
వారికి ఎవరూ సరికారు ॥ప్రజారాజ్యమే॥

2వ చరణం: ఎంత శక్తి గల యంత్రాన్నయినా
నడిపే దేవుడూ మానవుడే
దారులు తెలియని చీకటి కోసం
వెలిగించే దేవుడు – ఈ నరుడే ॥ప్రజారాజ్యమే॥

3వ చరణం: మానవ శక్తికి పట్టంగట్టే
శ్రమకే విజయం సాధించే
ప్రజలే సర్కారు – వారికి ఎవరూ సరికారు॥ప్రజారాజ్యమే॥

4వ చరణం: బంజరు భూములు పండించాలని
కష్టించే దేవుడు కార్మికుడేనని
సోమరి పోతుల రాజ్యాన్నంతా

శ్రామికులే ఎదిరించాలి.
ప్రజా రాజ్యమే మన గమ్యం
ప్రజా రాజ్యమే మనధ్యేయం //ప్రజారాజ్యమే//

5వ చరణం: ప్రజారాజ్యమని గర్జించాలి
ప్రజారాజ్యమే నిర్మించాలి
అజేయమైనది శ్రమశక్తి
శ్రమశక్తి ఇది జనశక్తి దీన్ని
గెలువనే లేదు ధనశక్తి //ప్రజారాజ్యమే//

6వ చరణం: పగలూ రేయీ - అర్థాకలితో
పాటుపడే దెవడు - శ్రామికుడే
ఇతరుల కోసం - చీమూ, నెత్తురూ
చిందించే దెవడు - కార్మికుడే
ప్రమాణాలతో నిజం దొరకదు
ప్రణామాలతో పంట పండదు
నినాదాలతో - కడుపు నిండదు
వాగ్దానాలకు - విలువే లేదు
పాటుపడే దెవడు - శ్రామికుడే
ప్రజలే సర్కారు - వారికి ఎవరూ సరికారు//ప్రజారాజ్యమే//

---

పద్మాలయా వారి "ప్రజారాజ్యం" చిత్రంలోనిదీ పాట.

అభిమానులకు చిన్న మనవి. ఈ పాట చాలా రకాలుగా, చాలా చరణాలతో రాసేరు. పిక్చర్లో ఎన్ని చరణాలున్నాయో నాకు తెలీదుకాని, ఉన్న చరణాలన్నీ ఒకదానికొకటి తీసిపోనట్లు వుండటం వల్ల వదిలెయ్యటానికి మనస్కొప్పక, వాటిని 3 భాగాలుగా విభజించి పుస్తకాలలో వెయ్యటం జరుగుతోంది నేనూ శ్రీ శ్రీ గారూ, విప్లవం గురించి, తరచుగా మాట్లాడుతుండేవాళ్ళం. మనదేశం, ప్రజలూ, బాగుపడతారన్న నమ్మకం నాకు లేదండి. ప్రపంచం మొత్తంమీద అంతటా ఒక్కలాగే వుంది అన్నా. నీ కేవిటి తెలుసునని ప్రపంచం గురించి మాట్లాడుతున్నావు సరోజా! నిజానికి, గొప్ప జబ్బు పడ్డ తర్వాత, మనిషి కోలుకుంటున్నట్లుంది ప్రస్తుతం ప్రపంచ స్థితి. ప్రజా సముద్రం పొంగిందంటే ఎవరూ దాన్ని ఆపలేరు! జీవితం స్థాణువు కాదు! చలన శీలనం అయింది. ఈ యుద్ధ జ్వాలలో తుప్పు పట్టిన అనేక భావాలు దగ్ధం అయిపోతాయి!

అన్నిటికన్నా ముఖ్యం ప్రజలలో ఒక చైతన్యం వెల్లివిరుస్తోంది జనం తండోప తండాలుగా, విరుచుకు పడుతున్నారు. ప్రజల్ని జో కొట్టే కాలం నశించి పోయింది నేటి ప్రజలు మారేరు! వారి ఆలోచనలకి ఆహారం కావాలి. వారిని సరియైన మార్గంలో నడిపించే నాయకుడు కావాలి! నాకు దేవుడి మీద నమ్మకం ఉందో లేదో నికరంగా చెప్పలేనుకానీ మానవుడి మీద మాత్రం అచంచలమైన విశ్వాసం ఉందని మాత్రం నిశ్చయంగా చెప్పగలను! అని అంటూంటే ఏవీ నాకు అర్థంగాక వారి ముఖం చూస్తూ కూర్చుండి పోయేను.

☆ ☆

# ఆంధ్రదేశం

శ్రీకాకుళం మొదలు
సింహాచలం – మొదలు
శ్రీశైలం దాకా
చిత్తూరు దాకా
తూరుపు కడలి మొదలు
పడమటి కనుమల దాకా
ఇది నాదేశం
విశాలాంధ్ర దేశం

కాదని వాదుకు వస్తే
కటకం మొదలు

కన్యాకుమారి దాకా
తెలుగు పలుకు

జిలిబిలి తేనె లొలుకు
జనని వీడు

ఇది నా తెలుగునాడు

ఇది 10–10–82 తేదీన రాసేరు. శ్రీశ్రీ గారికి మన ఆంధ్రదేశానికి "తెలుగునాడు" అని పేరు పెడితే బాగుండునని చాలా కోరికగా వుండేది. ఈ విషయం గౌరవనీయులైన నాటి ఆంధ్రప్రదేశ్, ముఖ్యమంత్రిగారైన శ్రీ. ఎన్.టి. రామారావు గారితో కూడా అన్నట్టు నాతో చెప్పేరు. నాకు బాగా జ్ఞాపకం వుంది. 1979లో మేము లండన్ వెళ్ళినపుడు అనేక చోట్ల సన్మానాలు, మీటింగ్‌లు జరిగేయి. అప్పుడు వేల్స్‌లో జరిగిన ఒక మీటింగ్‌లో మొత్తం ఆంధ్రదేశం వైశాల్యతని జనాభా లెక్కని వర్ణించి బ్రహ్మాండంగా మాటాడేశారు. యింటికొచ్చేసరికి రాత్రి 12 గం. అయిపోయింది. చాలా అలసిపోయి మంచం

మీద వాలగానే నిద్రపోతారనుకున్నాను. కాని నిద్రపోలేదు సరికదా, విపరీతమైన ఆలోచనలో మునిగి పోయేరు. ఏమిటండీ అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారని అడిగేను. ఏవీలేదు కాని ఈ రోజు మీటింగులో నీకు అర్థమయినదేమిటి? అని అడిగేరు. అన్నిటికన్నా మీ ఉద్రేక, ఆవేదనలు బాగా అర్థం అయేయి అన్నా! ఏ విషయంలో అన్నారు ఏ విషయం ఏవిటి? మన తెలుగు భాష, తెలుగుదేశం మన ఆంధ్రదేశపు విశాలతని జనాభా వగైరా వగైరా కొలతలతో సహా, ఆంధ్రదేశాన్ని వర్ణించి చెప్తూ వుంటే ఆశ్చర్యం వేసింది. మీదేశం మీదున్న మీ మోజు అభిమానం. మీ మాటల్లో వెల్లడౌతూ, మీ దేశభక్తిని చూస్తే అందరూ ఆనందాశ్చర్యాలలో ఉక్కిరి బిక్కిరై పోయేరు. నిజంగా అప్పుడు నాకు అనిపించింది. ఎంత గొప్ప కవి మాతృదేశం మీద భక్తి వుండి ఏం లాభం. బ్రాహ్మణుని గా పుట్టేరు పాపం లేకుంటే ఈసరికి ప్రభుత్వం ప్రజలు కూడా ఈ మహానుభావుడికి బ్రహ్మరధం పట్టేసి బిరుదులతో, భోగ భాగ్యాలతో ముంచెత్తేసేవారు అని అనగానే నువ్వొత్త పిచ్చిదానివి సరోజా! బ్రాహ్మణుడైతే జంధ్యం వేసుకోవాలిగా! నేను జంధ్యం వేసుకోలేదే! కాలం మారుతున్నా, బూజుపట్టిన మన పురాతనపు ఆనవాయితీలు, భావాలింకామాసి పోలేదు. ప్రజలంటావా! నా దేశం నా ప్రజలు నా రాజ్యం వేరు! పోతే, ప్రభుత్వం అంటావా! అది మాత్రం ఏం చేస్తుందిలే! ఇప్పుడీ గొడవలన్నీ ఎందుకుగాని ముఖ్యమైన విషయం గ్రహించేవా! వలస వెళ్ళిన వాళ్ళయినా ఇక్కడున్నవాళ్ళందరూ, మన వాళ్ళే అయినా విదేశాలలో అడుగు పెట్టేసరికి వాళ్ళలో కలిగిన మార్పులు చూశావా! ఇక్కడున్న ఆంధ్రులందరూ, వాళ్ళ వాళ్ళ నివాసాలకి దగ్గర్లో 10 కుటుంబాల వాళ్ళు కల్సి ఓ చిన్న స్కూలు పెట్టి వారానికి రెండు రోజులు మీ పిల్లలకి మీరే తెలుగు నేర్పండి అని ఈ రోజు మీటింగ్‌లో చెప్పేనా! అలాగే అని ఏకగ్రీవంగా అన్నారు! కాని వాళ్ళ పిల్లలు అనర్గళంగా ఇంగ్లీషులో మాట్లాడేసరికి అదే గొప్ప సంస్కారంగా ఫీలై పోయారు! ఇక్కడికొచ్చిన పిల్లలందర్నీ, మీ పేరేవిటని తెలుగులో అడిగేసరికి తెల్లమొఖాలేశారే కాని ఒక్కరయినా సమాధానం చెప్పేరా. అదే నాకు బాధగా ఉంది సరోజా అన్నారు. నేను వెంటనే అందుకే నండి పురిపండా వారి పాలసీ నాకు నచ్చిందని, లండన్లో అడుగుపెట్టింది మొదలు అంటున్నాను ఎన్ని మీటింగులయేయి అన్నిట్లో రామాయణంలోనివీ భారతం లోనివీ చిన్న చిన్న పిట్టకథలు వాటిని చెప్పి శభాసనిపించుకొని వేదిక దిగేస్తున్నారు. మీరే ఉద్రేకంతో వెర్రెక్కి పోతున్నారు అనగానే సర్లే లైటార్పి పడుకో అనేశారు ఇంత అమాయకులు, బతక నేర్చినతనం తెలీని మనిషి వుంటారా అనిపించింది.

☆ ☆ ☆

# దేశము మారిందోయ్

పల్లవి: దేశము మారిందోయి
కాలమ్ము మారిందోయి
కష్టాలు తీరేనోయి
సుఖాలు నీవే నోయ్

అనుపల్లవి: కొండల్ని కొట్టి – డాముల్ని కట్టి
నీళ్లను నిలిపి – చేలను తడిపి
మురిసే పచ్చని రోజు – మనకు
వస్తుందోయ్ వస్తుంది ॥దేశము మారిందోయ్॥

1వ చరణం: కండల్ని కరగ దియ్యి
బండల్ని విసిరివెయ్యి
నీదే పై చెయ్యి
భాగ్యాలు పండు నోయీ
గాదేలు నిండునోయీ
సిరులు చిందునోయీ
ఆశలు అందునోయీ
చేయి చేయి కలవాలి
రావయ్యా బావయ్యా ॥దేశము మారిందోయ్॥

2వ చరణం: గ్రామాలు బాగుచెయ్యి
దీపాలు వెలగనియ్యి
జేజేలు నీ కోయీ
చిట్టి చీమలన్ని పెద్ద. పుట్ట పెట్టుకాదా కాదా
ఎందరో తమ రక్తాన్ని – చిందించిరి కాదా – కాదా
అక్రమాల అసూయకు

విశాలాంధ్రలో ప్రజారాజ్యం

ఆనకట్టు ఇదే ఇదే
త్యాగమంటే ఇదే ఇదే
అనుభవమ్ము ఇదేనోయీ ఈ
ఆనందం నీదేనోయీ
నిజ మౌ శ్రమజీవి అంటే – నీవేనోయీ
నిజ మౌ శ్రమజీవి అంటే – నీవేనోయీ //దేశము
మారిందోయ్//

---

సురేష్ ప్రొడక్షన్ వారి "రాముడు–భీముడు" చిత్రంలోనిదీ పాట.
సంగీతం : పెండ్యాల
పాడినవారు : పి. సుశీల, బృందం - మరియు ఘంటసాల

శ్రామిక జీవుల గురించి పాటలు రాసే అవేశం కలిగితే మాత్రం. ఆపాటలోనుండి మంటలు రేపాలి. ప్రజల ఆలోచనాశక్తికి మెరుగు పెట్టాలి. నేడు ప్రపంచం మొత్తం మీద యుద్ధం వడబోస్తున్న ప్రచండ సమస్యకి, తక్షణ పరిష్కారం తమ కండబలం ధారపోసి శ్రమిస్తున్న కష్ట జీవులకి కడుపునిండా తిండి కట్టేందుకు గుడ్డ తలదాచుకోడానికి గూడు లభించాలి.

అది వాళ్లకి లభించనంత కాలం ఈ మారణ హోమం తప్పదు. వాళ్ళు తిరగబడి దేశాన్ని మార్చక తప్పదు. మార్చి, దేశం మారిందని నాపల్లవినే ఎలుగెత్తి పాడేరోజు అట్టే దూరంలోలేదు. త్వరలోనే వస్తుంది. అనేవారు. ప్రతి పాటకీ శ్రీశ్రీ మీతో ఏదో ఒకటి చెప్పేవారా అని, మీరడగొచ్చు. లేదు, మా జీవితంలో జరిగిన అనేక సంఘటనలూ, చర్చలూ, చర్యలూ, మాటలూ, వాదవివ్వాదాలు అన్నీ జ్ఞాపకం పెట్టుకొని ఆ ఆ పాటకి అనుగుణంగా, సంఘటనలు జ్ఞాపకం వచ్చినపుడు మా సంభాషణలను రాస్తున్నానని మాత్రం మనవి చేసుకుంటున్నాను!

☆ ☆ ☆

# నడూా నడూా నడచిరా!!

పల్లవి: నడూా నడూా నడచిరా! నడచిరా!
హంసవలె – నెమలివలె!
చెలీ నా చెలీ –
కదలిరా – కదలిరా ॥నడూా నడూా॥

అనుపల్లవి:- మెలికలు తిరిగే కులుకుతో!
నాగిని వలెనే కదలిరా!
ఆశలు విరిసే అదనులో!
ఐరావతమయి నడచిరా ॥నడూా నడూా॥

1వ చరణం: మంజు రవళితో
జుం జుం జుమ్మని
తుమ్మెద వలెనే తూలిరా ॥నడూా నడూా ॥

2వ చరణం: చంద్రుని కాంచిన జలధిలో
తరగల వలెనే తరలిరా
వలపులు కురిసే వయసుతో
కలయిక కోరి కదలిరా ॥నడూా నడూా॥

---

"చిలకా గోరింక" చిత్రంలోనిదీ పాట.

సంగీతం : టి. చలపతిరావు
పాడినవారు : ఘంటసాల
దర్శకత్వం : ప్రత్యగాత్మ

☆ ☆

# నిన్నటి నేడే రేపవుతుంది

పల్లవి: నిన్నటి నేడే రేపవుతుంది
రేపు నేటిలో నిదురోతుంది!
కర్షక కార్మిక కష్ట జీవులే
రాజ్యం చేసే రోజొస్తుంది
రేపటి కాలం – రగిలే జ్వాలలకాలం ॥నిన్నటి నేడే॥

అనుపల్లవి: ధనిక వాదమే
ఇకపై నశిస్తుందిలే
యువతరమే – నవ చరిత
రచిస్తుందిలే
సమసమాజమే – ఇలపై రహిస్తుందిలే
విరోధాల విభేదాలు దహిస్తుందిలే
మమతలు పెరిగే – కలతలు కరిగే
మానవ లోకం – మనదౌతుందిలే ॥నిన్నటి నేడే ॥

చరణం: ప్రజల నెత్తురు పీల్చు
కసాయి గుండెలు –
ప్రభువులమని పదవులలో
కదం తొక్కగా
మనిషి కోపమే నిలబడ
మహాయోధులు
సాయుధులై తిరగబడి
విజృంభించగా

మానవ రక్తమే - ఎర్రని రంగై
నింగిని తాకే - రోజొస్తుంది. ॥నిన్నటి నేడే॥

---

శ్రీసూర్య చంద్రావారి చిత్రంలోనిదీ పాట.

ఈ పాట రాస్తుంటే మావారన్నమాటలు జ్ఞాపకం వస్తున్నాయి. నేనెప్పుడైనా పొరపాటున వారితో ఏవండీ నిన్న ఏం జరిగిందో తెలుసా అని అంటే "అబ్బ నిన్నటి గురించి నాతోచెప్పకు సరోజా! నానిఘా, ఎప్పుడూ "రేపటి మీదే"వుంటుంది. నేను నా కలంతో చేస్తున్న యుద్ధం అంతా ఎవరికోసం, ఎందుకు? కారణం ఏవిటి· అందరికీ తెలుసు. కాని ఎవరూ పైకి అనరు. ఒక అమూల్య సత్యాన్ని కనిపెట్టినపుడు దాన్ని అందరి మధ్యలోకి తీసుకు రావాలనే తత్వం నాది. .అందుకే అంటున్నా అందరూ నిన్న నేటి గురించి మరిచి, రేపటి గురించి ఆలోచించే రోజు రంగంలోకి ప్రవేశించబోతోంది. నేను ఆశావాదిని! నా ప్రజలే నా ధనం ప్రాణంకూడ. నేను అందుకనే వాళ్ళకోసమే రాస్తాను. వాళ్లే నన్ను ఆదరిస్తా"రనే వారు.

☆ ☆ ☆

# ఇది రేయి కాదోయిగోపాలకా!!

పల్లవి: ఇది రేయి కాదోయి గోపాలకా
నడి వీధి ఇది తాళు తాళురా //ఇది రేయి//

అనుపల్లవి: పోయిరావోయి నీమోళి ఎలా
చాలు చాలించరా సరాగాలా

చేయి విడుమోయి జాలిగ వేడెద
వేళ రాగానే కూడెద గానలోలా //ఇది రేయి//

చరణం: మోము చూసేవురా గోము చేసి
కళ్ళు మూసేవురా దరిచేరి

సఖా నా సొగసు నావయసు – నీవిరా
సదా నీ ప్రేమ కోరెద గోపాలా //ఇది రేయి//

---

డి.బి.ఎస్. వారి "పెండ్లి పిలుపు" చిత్రంలోనిదీ పాట.

సంగీతం : కె. ప్రసాదరావు
పాడినవారు : జిక్కి (కృష్ణవేణి), ఎస్. జానకి.
నిర్మాత : డి.బి.ఎస్.
దర్శకులు : ఆమంచర్ల శేషగిరిరావు

☆ ☆ ☆

# యువతరం - నవతరం

పల్లవి: యువతరం - నవతరం
నవ నవలాడే - నవతరం
ఉరకలు వేసే - యువతరం
మనల నాపడం - యెవరి తరం //యువతరం//

అనుపల్లవి: ముందు ముందు సాగిపోయే
యువకులం మేము
స్వేచ్ఛ కోసం పోరు సలిపే
యువతులం మేము

మనమూ మనమూ ఏకమైతే
మార్పు సాధిస్తాం.... //యువతరం//

1వ చరణం: ఆటలందు దోరవయసు
తొంగి చూడాలి
పాటలందు కొంటెమనసు
పొంగిపోవాలి

చేయీ చేయీ కలిపి - సరదాల తేలీ తేలీ
పాతకాలం రోతలన్నీ - మరిపించెయ్యాలి//యువతరం//

2వ చరణం: యౌవ్వనమే అందరికీ - వరములాంటిది
నవ్వులతో గడపడమే -మనకు మంచిది

వడివడిగా నీటిలోనె బోటుషికారు
లోతులోతు కెళుతూంటే బలేహుషారు

చల్ - చల్ - చల్ బోటుషికారు
జిల్ - జిల్ - జిల్ - బలే హుషారు
జంటలుగా వలపు మజా - రుచి చూడాలి//యువతరం//

---

"నిండుకుటుంబం" చిత్రంలోనిదీ పాట.

# ఆగవోయీ - ఆగవోయీ

పల్లవి: ఆగవోయీ – ఆగవోయీ – ఆగవోయీ – ఆగవోయీ
త్యాగం ఇదియేనా! హృదయం శిలయేనా
ఏల యీమోసం ॥ఆగవోయీ॥

అనుపల్లవి: ఇల్లాలి మనసే కల్లోల మాయె
ఏలా యీమోసం – ఏదీ నీ హృదయం॥

1వ చరణం: నీవు కట్టిన తాళి – నిగనిగ మెరిసేను
కనికరమున గాజులు – కరముల వెలిగేను॥

ఆనాటి పారాణి – ఆనవాలు మిగిలేను
ఆజాలి, ఆ మమత – నీకు లేకపోయెనా
ఏదీ నీహృదయం

2వ చరణం:- నిలువ నీడనిచ్చావు – నగలు చీరె లిచ్చావు
అంతూ పొంతూలేని – ఆశలు కలిగించావూ

బాధ్యత అంతతో తీరేనని తలచావా?
అంతేనా చదివిన నీ చదువదంతా – వ్యర్థమా?
ఏదీ నీహృదయం

3వ చరణం: రేయిపవలు కంటికి రెప్పగా
మేను మనసు మాట ఒక్కటిగా

జీవితమంతా చెంత నిలిచివుండాలి
త్యాగమదే – త్యాగమదే

మూడు ముళ్ళు వేయుటయే–
త్యాగమనీ తలచితివా

ఏది నీ హృదయం - త్యాగం ఇదియేనా
హృదయం శిలయేనా - ఏలా యీమోసం

**4వ చరణం:** కలకంఠి కంట కన్నీరొలికినచో
గరళమై పోవును అమృతమే - మరువకుమా

కన్నులున్న అంధుడవై బాధలు పడనేలా
కనులు లేని దీనురాలి గాధలు వినలేవా?

మగువను నీ దానిని చేసుకో
మనసును నీదారికి తీసుకో

మానవరూపంలో దేవునిగా మారిపో ॥ఆగవోయీ॥

---

ఇది బాబూ మూవీస్ వారి "మంచిమనసులు" చిత్రంలోనిది.
సంగీతం : పుగళేంది (వీరు కె.వి. మహదేవన్‌గారి అసిస్టెంట్)
పాడినవారు : పి. సుశీల
నిర్మాత : సి. సుందరం
దర్శకత్వం : ఆదుర్తి సుబ్బారావు

కలకంఠి కంటి కన్నీరొలికిన అనులైనులో నాకు ఓసంగతి జ్ఞాపకం వచ్చింది. చాలా మంది శ్రీశ్రీ గారిని నన్ను కూడా "మహిళల గురించి" శ్రీశ్రీ అభిప్రాయం ఏవిటి? ఆడవాళ్లని సపోర్టు చేసి ఎప్పుడైనా, మాట్లాడేరా? అని అడిగేరు.

1996వ సం. ఏప్రిల్ మే నెల లనుకుంటాను. మద్రాసు ఆలిండియా రేడియో వాళ్లు నా ఇంటర్‌వ్యూ తీసుకుని ఇదే మాటని అడిగేరు. అప్పుడు నేనన్నాను. "వారు మహిళల గురించి" వారి స్వాతంత్ర్యం గురించి పాటలు కూడా రాశారు. మహిళల మీద శ్రీశ్రీ అభిప్రాయాన్ని చెప్పాలంటే నా వరకు నేనే ఉదాహరణని చెప్తున్నాను. ఆడవాళ్లు అన్నిటికీ సమర్థులు. మగవారికి వాళ్ళెందులోనూ, ఏ మాత్రం తీసిపోరు కాబట్టే నేను చెప్పినట్లు చెయ్యాలి. డబ్బింగ్ చిత్రాలకు మాటలు రాయడానికి, ట్రైనింగిచ్చి, "డైలాగ్ డైరక్టర్ని, డబ్బింగ్ డైరెక్టర్ని, మ్యూజిక్ డైరక్టర్నీ, చేసి; నాకూ అంటూ, ఒక స్థానం కల్పించేరు. భార్య కనుక చేశారని మీరు అనుకోవచ్చు. ఇవన్నీ నన్ను భార్యగా స్వీకరించటానికి ముందే చేశారు. 1956 ఆగష్టులో వారి దగ్గరకి నేనొచ్చాను. 1959లో మా వివాహం అయ్యింది. అప్పటికే మేము ఇద్దరం కలిసి 60 పిక్చర్లకి పైగా చేశాం. వారి అసిస్టెంట్‌గా చేరాను. నా టేలెంట్స్‌ని చూసి నాకు

ట్రైనింగిచ్చేశారు. ఇల్లు కొన్నాకనే వారిని వివాహం చేసుకున్నాను. ఇవన్నీ ఎందుకు రాస్తున్నానంటే ఆడదే కదా అనే అభిప్రాయమే ఉంటే నాకోసం ఇంత కష్టపడవలసిన అవసరం లేదు. టేలెంట్స్ వున్నవాళ్లెవరికైనా సరే సహాయం చెయ్యటంలో శ్రీశ్రీ వెనకాడేవారు కారు. కీ.శే. రాజబాబుని ఆడవాళ్ళలో ప్రభ (హీరోయిన్) జయప్రద (హీరోయిన్) ఇంకా చాలామందిని ఫిల్మ్‌కి పరిచయం చేసిందివారే తరువాత అప్పుడప్పుడు మాటలతో చిరునవ్వుతో అబ్బబ్బ మీ ఆడవాళ్ళతో సాల్లేంపు నాయనా అనేవారు. అలాగే వారికి అబద్ధాలన్నా, దగా, మోసం అన్నా చాలా అసహ్యం. ఒకసారి ఆడేవిటి, మగేవిటి సరోజా సామర్థ్యం వుండి నిజాయితీగా, న్యాయంగా వుండి న్యాయం కోసం పోట్లాడే వాళ్ళు ముందుకొస్తే వాళ్లకిదే నా ఆహ్వానం అనేవారు. మాకు ముగ్గురు ఆడ పిల్లలు. ఒకడే కొడుకు. నలుగురినీ ఒకే విధంగా, ఒకే దృష్టితో పెంచి, పెద్ద వాళ్ళని చేసి, ప్రేమాభిమానాలు చూపేరే కాని ఆడా మగా భేదం ఏనాడూ చూపలేదు.

☆ ☆ ☆

# హృదయమె నీతి

పల్లవి: హృదయమె నీతి – ఈ జగతికి జ్యోతి
ఇదే హారతి – మా భారతీ ॥హృదయమె॥

అనుపల్లవి: కృతుల కావ్యముల
మధురముగా సతతము
గొలుతుము – మాతా భారతీ ॥హృదయమె॥

చరణం: హృదయ కుసుమముల
వుంచి నుతింతుము
నేకొలిచి తరింతు – వందే
వందే సదా మాతా ॥హృదయమె॥

---

రోహిణి పిక్చర్స్ వారి "నిర్దోషి" చిత్రంలోనిదీ పాట

సంగీతం : కీ.శే. ఘంటసాల
పాడినవారు : కీ.శే. ఘంటసాల
దర్శకత్వం : హెచ్.ఎమ్. రెడ్డి

ఈ చిత్రానికి కథమాటలు రాసింది శ్రీశ్రీ. వారితో పాటు కొండముది గోపాలరాయశర్మ సదాశివ బ్రహ్మం, ఆత్రేయ పాటలు రాసేరు. ఇక్కడొక విషయం రాయాలి. శ్రీశ్రీ గారికి తనదేశం తన ప్రజలు అంటే చాలా అభిమానం. స్వదేశీ అభిమానం అని చెప్పాలి. వారు చైనా వెళ్లినపుడు అక్కడ కొంత కాలం వుండి తెలుగు భాషకి సంబంధించిన చదువు అక్కడి వాళ్లకు చెప్పమని అడిగేరట. ఒక విధంగా అది చాలా మంచి అవకాశంససేమిరా కాదని ఒప్పేశారు. మీకు చైనా అంటే ఇష్టం కదా. ఎందుకలా కాదన్నారని అడిగేను. ఇష్టం కనకే వెళ్ళేను, చూసేను. అంతేకాని అంటూవుండగానే ఎక్కువ మాట్లాడితే చీవాట్లు పడుతాయని అక్కడ్నుంచి వెళ్లిపోయేను.

☆ ☆ ☆

# ఓ రంగయో

పనివాళ్లు: ఓ.... రంగయో
పూల రంగయో
ఓర సూపు సారించి – సాగిపోవయో
పొద్దు వాలి పోతున్న దోయీ – ఇంత
మెద్దు నడక నీ కెందుకోయి? //ఓ రంగయో//

పగలనక రేయనక–
పడుతున్న శ్రమనంతా
పరుల కొరకు ధారపోయు –
మూగ జీవులు
ఆటలలో పాటలలో – ఆయాసం మరచిపోయి
ఆనందం పొందగలుగు ధన్యజీవులు //ఓ రంగయో//

కడుపారగ కూడులేని
తలదాచగ గూడులేని
ఈ దీన జనుల –జీవితాలు
మారుటెన్నడో?
కలవారలు – లేనివారి
కష్టాలను తీర్చుదారి
కనిపెట్టి మేలుచేయ
గలిగినప్పుడే //ఓ రంగయో//

---

అన్న పూర్ణవారి "వెలుగునీడలు" లోని పాట యిది.

సంగీతం : వేణు     పాడినవారు : పి. సుశీల - బృందం, ఘంటసాల

☆ ☆ ☆

# చక్కనివాడే దొరికేడు

పల్లవి: చక్కని వాడే దొరికేడు
టక్కరి రాధకు చెలికాడు

అనుపల్లవి: మక్కువతో మనసిచ్చీ – మెచ్చిన
చుక్కల రేడె బలే బలే బల్ ||చక్కనివాడే||

1వ చరణం: అందరిలో మొనగాడే – నిన్ను
అందంతో మై మరపించాడే
ఆకర్షించావ్ – కోహీ నూరునే
మాకా ఆనందం – అదే బలే బలే ||చక్కనివాడే||

2వ చరణం: లక్కీ ఛాన్సిది నేడే నీకు
దక్కేనులే చేయి జార్చగ బోకు
మేమందరమూ అభినందించే
లవ్ మేరేజ్ ఇదే ఇదే బల్ ||చక్కనివాడే||

3వ చరణం: అచ్చట ముచ్చటలన్నీ – నీవు
చెప్పక పోతే తెలియక పోవు
ఇంకా ఎందుకు డిలే – డిలే – బల్ ||చక్కనివాడే||

---

డి.బి.ఎస్.వారి "పెండ్లి పిలుపు" చిత్రంలోనిదీ పాట.

సంగీతం : కె. ప్రసాదరావు
పాడినవారు : జిక్కి (కృష్ణవేణి) మరియు బృందం
నిర్మాత : డి.బి.ఎస్.
దర్శకత్వం : ఆమంచర్ల శేషగిరిరావు

# రండోయ్ - రండోయ్ - యోగులంతా

పల్లవి: రండోయ్... రండోయ్ - యోగులంతా
లెండోయ్ - లెండోయ్ - భోగులంతా

ఈగలాగ - డేగలాగ - ఎగిరి పోదాం
గాలిలాగ - ధూళిలాగ - కలిసిపోదాం ॥రండోయ్॥

అనుపల్లవి: ఎన్ని రేపులైనా - నిన్నలవ్ జగాన
ఉన్నరోజె - ఎన్నడైన- మనకు పండుగ

1వ చరణం: అందరి దొక జాతి - అందరికొక నీతి
హద్దులుంచు - బంధనాలె శుద్ధదండుగ
హిప్పీ - హిప్పీ - షేక్ -
మెర్రి - మెర్రి - మేక్॥రండోయ్॥

2వ చరణం: అరువు తిండి తింటాం - కరువు పస్తులుంటాం
అదుపులేని బ్రతుకుమాది - టాం - టాం - టాం

3వ చరణం: వానలోనె స్నానం - రాలి పోతె క్షౌరం
రాజులేడు - బంటులేడు - రాం - రాం - రాం
హిప్పీ - హిప్పీ - షేక్...
మెర్రి - మెర్రి - మేక్॥రండోయ్॥

---

ఆర్.ఆర్. పిక్చర్స్ వారి "మాయింటి కోడలు" చిత్రంలోనిదీ పాట.
సంగీతం : ఆర్. గోవర్ధన్
పాడినవారు : ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, యల్.ఆర్.ఈశ్వరి కోరస్

☆ ☆ ☆

# ఈ వీణ నా ప్రాణమే

పల్లవి: ఈ వీణ నా ప్రాణమే ఇది
కలలై మిన్నేటి అలలై
పులకించి, పలికించు – నవరాగమే॥ఈ వీణ నా ప్రాణమే॥

అనుపల్లవి: కొనగోట మీటగా – ఒక తీగ హాయిగా
కోయిలై కూజించునే
జాలిగా ఒక జంట బాసిన
చక్క శోధించునే

శృతులలో, సంగీత గతులలో
మధుర సంస్కృతులే, తరంగించులే ॥ఈ వీణ నా ప్రాణమే॥

చరణం: ప్రాభాత సమయాల – పద్మ సుందరి వోలె
మేలు కొలుపులు మ్రోయునే

చలువ వెన్నెల కల కలువ కన్నియ లీల
జోల పాటలు పాడునే

ప్రియదర్శనానంద మాలాపనగసాగి
ఆరాధనగ మారునే ॥ఈ వీణ నా ప్రాణమే॥

---

"సృష్టి రహస్యాలు" చిత్రంలోనిదీ పాట

సంగీతం: కే.శే. పెండ్యాల — పాడినవారు: ఎస్. జానకి

శ్రీ శ్రీ గారికి వీణ పాటలంటే చాలాయిష్టం అనుకుంటాను. నిజంగానే వారి వీణ పాటలన్నీ చాలా పాపులర్ అయేయి. అందుకనే ఇంట్లో వుండే టైములో నా క్లాసులు జరుగుతున్నప్పుడు నా ఒడిలో వీణ ఉండగానే ఎడంచేత్తో వీణ మీటుతూ తననా తననా అని కూనిరాగాలు తీస్తూ ఇదే రాగమో చెప్పుకో ముసిలీ చెప్పుకో అనే వారు. వాయించకుండానే, రాగం కనిపెట్టాలా? బలేవారేనండీ అని నవ్వేదాన్ని.

☆ ☆ ☆

# చక్కని ఈ లోకమున

**పల్లవి:** చక్కని ఈ లోకమున
చల్లని ఈ తీరాన
జీవనమే హాయి సఖీ
ఆశయ మొకటాయె చెలీ //చక్కని//

**అనుపల్లవి:** హంసవలె ఓ పడవా
ఊగుచు రావే
ఎల్లరి ఎడ ఎల్ల ఎదల
స్నేహం కలిసీ - ప్రేమ సూత్రమే
మనల ఒకటిగ కలిపే //చక్కని//

**చరణం:** ప్రాణమునకు ప్రాణముగా
భావించెద నిను సదా
హంసవలె ఓ పడవా
ఊగుచు రావే

---

నవీనా ఫిలిమ్స్ వారు నిర్మించిన "ఆహుతి" చిత్రంలోనిదీ పాట.
సంగీతం : ఎస్.రాజేశ్వరరావు
పాడినవారు : శ్రీ ఘంటసాల & బాలసరస్వతి

"ఆహుతి" తెలుగులో మొట్టమొదటి డబ్బింగ్ చిత్రం. 1949వ సంవత్సరంలో హిందీలో "నీరా ఔర్ నందా" అనే చిత్రం తీశేరు. ఈ హిందీ చిత్రానికి "ఆహుతి" తెలుగు రూపం. దీనికి నిర్వహణ జగన్నాథ్; హిందీమూలమ్ ఆర్.యస్. జునార్కర్. ఇది నిస్సంశయంగా గొప్ప చిత్రం. అయినా వ్యాపార రీత్యా నష్ట పోయింది.

మళయాళ చిత్రం "చెమ్మీన్"లో లాటి సముద్ర తీరపు పల్లెవాతావరణం. సంఘక్షేమానికి బలి అయిన ప్రేమికుల కథకు పూర్వరంగాన్ని సమకూర్చిందని వారు చెప్పేరు. ఈ చిత్రం వారు రాసినపుడు నేను మద్రాసులో అడుగు పెట్టలేదు.

# ఇంతేలే ఇంతేలే ఈ బ్రతుకింతేలే

పల్లవి: ఇంతేలే యీ బ్రతుకింతేలే
యీ బ్రతుకింతేలే

కలత చెందినా సుఖమే లేదులే
యింతేలే ఈ బ్రతుకింతేలే

అనుపల్లవి: వికసించకయే రాలిన పూలూ
పేదల బ్రతుకులు కూలిన గోడలు //ఇంతేలే//

1వ చరణం: ఏ మాశించిన – ఎంత శ్రమించిన
బ్రతుకింతేలే – చింతల పాలే
లోకపు రీతీ ఇంతేలే
ఈ బ్రతుకింతే లే //ఇంతేలే//

2వ చరణం: తనువులు కృంగే – బాధల మోపులు
పేదల బతుకులు – ఎండిన పొదుగులు //ఇంతేలే//

3వ చరణం: చితికిన గుండెలో చీకటి నిండే
జీవితమే చెరసాలోయీ

నిరుపేదలకూ, గతియింతేలే
లోకపుతీరు ఇంతేలే //ఇంతేలే//

---

రోహిణి పిక్చర్స్ వారి "నిరుపేదలు" చిత్రంలోనిదీ పాట.

సంగీతం: కె. ప్రసాద్ పాడినవారు: ఎమ్.ఎస్. రామారావు

శ్రీశ్రీ మాటలు: శ్రమ జీవుల కష్టాలు కడతేరాలంటే మీరు కోరుకొనే విప్లవం ఎలాంటిదో నాకు తెలీదు కాని నేను వాంఛించేది సాయుధ విప్లవం. అది బహుశా ఈ తరంలో రాక పోవచ్చు. కాని నిశ్చయంగా వచ్చే తీరుతుంది. సాయుధ విప్లవం అంటే చీపురు పుల్లలతో చేసే యుద్ధంకాదు. శత్రువుల ఆయుధాలను వాళ్ళ చేతులనుంచి గుంజుకొని వాళ్ల ఆయుధాలతోనే తుదముట్టించడం ఇదీ నేను కోరుకొనే విప్లవం. ఇది నా జీవిత కాలంలోనే వస్తే నాకన్నా సంతోషించే వాడుండడు.

☆ ☆ ☆

# అమ్మా కనుమూశావా!

పల్లవి: అమ్మా కనుమూశావా
మోసం ద్వేషం నిండిన లోకం
వదిలేశావా!!

అనుపల్లవి: నీతీ న్యాయం దొరికే చోటు
వెదకుతు పోయావా

ఇక్కడ లేనీ శాంతీ – సమతా
అక్కడ నీకు దొరకునులే //అమ్మా//

చరణం: నిను జూచైనా – యిక మీదైనా
మనసులు కరగాలి – ఇలలో
మనషులు మారాలి //అమ్మా//

---

"మనుషులు మారాలి" చిత్రంలోనిదీపాట.

సంగీతం : కీ.శే. ఘంటసాల
పాడినవారు : కీ.శే. ఘంటసాల
దర్శకత్వం : వి. మధుసూదనరావు

☆ ☆ ☆

అర్థం ఒక్కటే. అర్థంలో భావంలో మార్పులుండవు. పోతే ఎవరి భాష మీద వారికి అభిమానం వుండటం సహజం ఆదే విధంగా కులం మత భేదాల తత్వం కలిగి వుండటం నిజంగా దురదృష్టం. అందరి లోనూ ప్రవహించే రక్తం ఒక్కటే నాకు మాత్రం జాతి, కుల మత భేదాలూ, ఏ కోశానా లేవు అని అనటమే కాదు. మేం ఇరువురం ఒక ముస్లిమ్ మిత్రుని ఇంట్లో విందు కూడ ఆరగించేం. 20వ శతాబ్దంలో వుంటున్నా మానవుల బుద్ధి మాత్రం 14 – 15 శతాబ్దపు చూరుల్ని పట్టుకొని వేలాడటం వదల్లేదు. అని అనేవారు.

☆ ☆ ☆

# పొగరు పోతునా!!

**పల్లవి:** పొగరుపోతునా – నేను
పొగరు పోతునా ఔను
నేను పొగరు పోతునే
నేను పొగరు పోతునే

చింతకు చిగురే సింగారం
మనిషికి పొగరే బంగారం ఔను
నేను పొగరు పోతునే

**అనుపల్లవి:** తడి గుడ్డలతో గొంతులు కోసే
చెడులోకంలో బ్రతకాలంటే
మనిషికి తెగువా – తెంపరితనమూ
పొగరూ – చిగురూ కావాలి //ఔను నేను//

**చరణం:** అన్యాయాలను నరకాలంటే
అక్రమాలపై ఉరకాలంటే
ఏకాకిని పలుగాకులు పొడిచే
ఈ లోకంలో నడవాలంటే

గుండె ధైర్యమే కావాలి నువ్వు
పొగరు పోతువై పోవాలి //ఔను నేను//

---

ఇది సినిమాలో రాసిన పాటా లేక శ్రీశ్రీ రాసుకున్న పాటా అని నాకింకా తెలీలేదు. కాని శ్రీశ్రీ రాసిందేనని మాత్రం గారంటీ. సందర్భం వచ్చింది కనుక ఓ మాట చెప్పాలి. నేను నానా అవస్థలు పడి ఎక్కడెక్కడున్న శ్రీశ్రీ పాటల్ని పోగుచేసుకొని ముద్రణ కిస్తున్నాను. శ్రీశ్రీ గారున్నప్పుడే మిత్రులు శ్రీ భూతేశ్వరరావుగారు చాలా పాటలు పంపి సినిమా పాటల్ని తప్పక పుస్తకరూపంలో తెమ్మని గురువు గార్ని చాలా ప్రోత్సాహపరిచేరు. మొదట ఈ ఆలోచనతో పాటు సహకరించిన భూతేశ్వరరావుగారికి కృతజ్ఞతలు. తర్వాత వి.ఎ.కె రంగారావుగారు రెండువందల పాటల దాకా వారింట్లోనే కూర్చుని ఫేర్ చేసుకున్నాను. రెండవ పుస్తకం తెలుగువీర లేవరా విశాలాంధ్ర వారి సహకారంతో విడుదల చేశాం. వి.ఎ.కె. వారి ప్రోత్సాహం, శ్రీశ్రీ

సినిమా పాటల విషయంలో మొత్తం  పాటలన్నీ వచ్చేదాకా, తప్పకుండా వుంటుందని ఈ మధ్యనే స్వయంగా తెలియ చేశారు కూడా. పోతే కొందరు నన్ను చాలా నిరుత్సాహ పరుస్తున్నారు. వారి సహకారాన్ని అర్థించిన నాకు, చేయూత నివ్వక పోవటం  సరికదా – చేస్తున్న "డిస్కరేజ్"కి చాలా బాధ పడుతున్నాను. శ్రీశ్రీ రాయని పాటలు కూడ వస్తున్నాయని  వారి బాధ. లోగడ శ్రీశ్రీ అన్నట్టు పొరపాట్లకి "మహామహులే దూడ లేస్తున్నప్పుడు" ఏదో శ్రీశ్రీ సాహిత్యాన్ని (సినిమా సాహిత్యం అయినా) పుస్తక రూపంలో తీసుకు రావాలన్న సదుద్దేశంతో ఏదో నా అవస్థలు  నేను పడుతున్నా ముందే పాఠక జనానికి మనవి చేశాను. మళ్ళీ చేస్తున్నాను. పొరపాటున శ్రీశ్రీ పాటకానిది  వేశాననుకోండి! ఆ పొరపాటును తెలుసుకున్న లేక నా అభిమానులు తెలిపిన రోజున మీ అందరి  ముందుకొచ్చి మిమ్మల్నీ ఆ పాటలు రాసిన కవుల్ని క్షమాపణ కోరుకుంటాను. శ్రీశ్రీ సాహిత్యంతో  నాల్గు డబ్బులు సంపాదించుకోవాలనుకోటంలో తప్పు లేదనుకుంటాను. నాకెవరూ చందా లిచ్చేవారులేరు. వారి  పేరుతో చందాలెత్తుకొని బాగుపడే తెలివి తేటలూ లేవు. ఒకవేళ నేను నోరు విప్పి అడిగితే ఇంటికో పైసా ఇచ్చినా ? అవే ఆంధ్రదేశంలో కొన్ని లక్షలౌతాయి. అది వేరే సంగతి. కాని ఆ పని మాకన్న ముందే శ్రీశ్రీ పోయిన  కొత్తలో శ్రీశ్రీ కుటుంబాన్ని ఉద్ధరిస్తామని, కొన్ని లక్షలు కాజేశారు. ఒక్కనయా పైసా కూడా మేం  కళ్ళ చూడలేదు. శ్రీశ్రీ సాహిత్యాన్ని శ్రీశ్రీ డబ్బుని ఎందరో దోచుకున్నారు. వారేమి అవలేదు. ఆ దోపిడీతో  పాటు వారు చనిపోయేక ఇది ఈ విధమైన దోపిడి అనుకున్నానే కాని తెలిసికూడ నోరు విప్పి  ఒక్క మాటైనా అనలేదు. శ్రీశ్రీ పాట అవునో కాదో అన్న సంగతి నాశక్తి వంచన లేకుండా ప్రయత్నించి, శ్రీశ్రీ  పాటని వున్నవాటినీ వారి దస్తూరీతో వున్న వాటినీ ఆధారంగా తీసుకొని వేస్తున్నాం. అందులో కొన్ని  ఏ సినిమా లోవో – సంగీత దర్శకులెవరో పాడిన వారి పేర్లూ తెలీకున్నా పాటల్ని మాత్రం ముందు మీముందుంచితే తర్వాత వివరాలు తెల్సుకొని రెండవ ముద్రణలో వెయ్యొచ్చనీ శ్రీశ్రీ రాసిన ప్రతి పాటా, మాటా, పుస్తకంలో తేవాలనే సదభిప్రాయంతోనే తాపత్రయపడుతున్నానే కాని ఎవర్నీ మోసగించాలనో  అవమానపర్చాలనో కాదు. శ్రీశ్రీ పాటల సేకరణలో పొరపాటు జరిగి వారి పాటకానిది వుంటే ఆ పాటలు రాసిన కవులు సంగీత దర్శకులు పాడినవారు (వారి పేర్లు మారితే) నన్ను క్షమించి  నా పొరపాటును నాకు తెలియచేసి సహకరించవలసిందిగా, పాఠక జనులనూ, శ్రీశ్రీ అభిమానులనూ కోరుతూ  సెలవుతీసుకుంటున్నాను.

★ ★ ★

# రాకపోదు రేపు - మాకు

పల్లవి: రాకపోదు రేపు మాకు
అరి పోదు ఆశ మాకు
మాదే ఈ యుగం

అనుపల్లవి: సాగే అడుగులు ఆగవులే
వడి వడి పరుగిడులే
కాలే బ్రతుకు పోరునులే
మనిషే మారునులే //రాకపోదు//

1వ చరణం: బ్రతికే దారులు కలవు చాల
ఎదలో ఆశను విడువనేల
ఒకడే చాలు సవాల్ చేయ
చవటలతో పనియేలా //రాకపోదు//

2వ చరణం: ఆకలి తీరదు కేకలేస్తే
రూకలు రాలవు చేయిజాస్తే
చీకటి తెరలను తొలగిస్తాం
ఆశాజ్యోతులు వెలిగిస్తాం //రాకపోదు//

---

శ్రీ శ్రీ మాట; భారతదేశంలో దారిద్ర్యం, నిరుద్యోగం, పాలకుల పరపీడన, దుర్భర స్థితి గతులకు దారి తీసేయి, కర్షక కార్మిక వర్గాలు ఆకలి మంటలతో అల్లాడిపోయేయి, రాకపోదు రేపు మాకంటూ; ప్రజలు ధైర్య సాహసాలతో ఓర్మితో, సంపూర్ణ స్వాతంత్ర్యంకోసం. నిరీక్షించేరు సాధించేరు కాని. నేననుకున్న, పూర్తి స్వతంత్ర్యం ప్రజలకి రాలేదు. ఏనాడు వారికి కూడూ, గుడ్డా గూడూ, దొరికి నిరక్షరాస్యులు అక్షరాస్యులౌతారు. ఆనాడు నాకలలు ఫలించినట్టవుతుంది. ప్రజలు ఎల్ల చోట్లా ఎల్లప్పుడూ ప్రకాశించాలి! మనదేశంలో వికసించ బోయే నూతన, సమ సమాజం, పట్ల అచంచల విశ్వాసం ఉంది. ఈ శ్రీ శ్రీ ఆశాజీవి.

☆ ☆ ☆

# ఇద్దరమే - మనమిద్దరమే

పల్లవి: ఇద్దరమే – మనమిద్దరమే, ఇద్దరమే
కొల్లేటి కొలనులో – కులికేటి అలలమై
వలపించే భావాల వెల లేని కలలమై //ఇద్దరమే//

అనుపల్లవి: తొలి సంజ వెలుగులో – కలువపూబాటలా
వికసించే ఎదలలో – విడిపోని జంటగా
విడిపోని జంటగా //ఇద్దరమే//

1వ చరణం: గరి మాగు పొదలలో
పరువంపు దోనెలో

కువకువల పిలుపులో
పులకించే పాటగా //ఇద్దరమే//

2వ చరణము: సరితోడు నీడగా
పలికింది చేతగా

సరితోడు నీడగా పలికింది చేతగా
పదిమంది కోసమే
బతకాలి నీతిగా
బతకాలి నీతిగా //ఇద్దరమే//

---

ఈ పాట శ్రీ ఫిలింస్ వారి "కొల్లేటి కాపురం" చిత్రంలోనిది.
దర్శకత్వం : తిలక్
సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు
పాడినవారు : పి. సుశీల, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం
నిర్మాతలు : గుమ్మడి శ్రీమన్నారాయణ, కొర్లిపర కృష్ణారావు

# లేనే లేదా అంతం లేనే లేదా!!

పల్లవి: లేనే లేదా అంతం లేనే లేదా
రానే రాదా విముక్తి, రానే రాదా
బలవంతులకు నరహంతకులకు
బలికావాలా మానవత ॥లేనేలెదా॥

అనుపల్లవి: తల్లి ఎదుటనే బిడ్డను నరికి
భర్త ఎదుటనే భార్యను చెరిచి
పుస్తెలు తెంచి ఆస్తులు దోచే
అమానుషాలకు అంతం లేదా ॥లేనేలేదా॥

1వ చరణం: కడుపులు కాలిన కన్న తల్లులకు – దారేది
ఉన్న ఊరినే వదిలే వారికి – ఊరేది
తల్లిని తండ్రిని కోలు పోయిన
ఈ పిల్లలకూ దిక్కేది
కళ్లుపోయినా కాళ్ళు విరిగినా
వికలాంగులకూ బతుకేదీ ॥లేనేలేదా॥

2వ చరణం: కమ్మిన చీకటి పారద్రోలగా
కాంతి కిరణమే రాదా
సమ్మెట గుమ్మెట సంధించే
ఒక సాహస వీరుడు రాడా

అభాగ్యజీవుల ఆక్రందనలు
అనాథ జనుల అశ్రుధారలు
కడలితరగలై పిడుగుల జడులై
ఒకే శక్తిగా – ఒకే వ్యక్తిగా

రుద్రమూర్తియై రూపొందాలి
క్షుద్రశక్తులను హతమార్చాలి
హతమార్చాలీ - పరిమార్చాలీ //లేనేలేదా//

---

"మంచి వాళ్ళకు మంచివాడు" చిత్రంలోనిదీ పాట.

శ్రీ శ్రీ గారున్నంత కాలం ఎవర్నీ, ఏ సంఘటనల్నీ పట్టించుకొనే దాన్ని కాను. లేనే లేదా అంతం లేనే లేదా! అని ఫేర్ చేస్తుంటే నాకు జ్ఞాపకం వచ్చి రాస్తున్నా! ఆర్థికంగా మేం చాలా ఇబ్బందులు పడినా, ఒకర్నొకరం చూసుకొని ఇద్దరం కలిసి పిల్లల్ని చూసుకొని హాయిగా కాలక్షేపం చేసేవాళ్లం. దీపం ఉన్నప్పుడే ఇల్లు చక్క పెట్టుకోవాలన్న సామెతకి నిజంగా నాకు అర్థం వారు పోయేదాకా తెలీదు. తీరా తెలుసుకొనే సమయం వచ్చేసరికి నాదారిన నన్ను వదిలేసి వారు చల్లగా వెళ్ళిపోయేరు. మన కష్టాలకి అంతంలేదా ఇద్దరం బ్రతికున్నంత కాలం ఇలా జీవితాలు వెళ్లాల్సిందేనా అంటే! నవ్వేసేవారు వార్ని బ్రతికించుకోవడానికి ఇల్లు ఒకటి తప్ప మిగిలిన పిసరు పిప్పి అన్నీ అమ్ముకొని నేను పడిన శ్రమ, నా భాధ ఏదీ పని చెయ్యలేదు. నా జ్ఞాపకాలు నన్ను ఏడిపిస్తున్నాయి. రాయాలంటే 100 పేజీల పుస్తకం అవుతుంది. రాయటానికి వీల్లేదు నా శ్రీ శ్రీ నాకు లేరని మాత్రం రాయగలను.

☆ ☆ ☆

# చిత్రమె పాడునటే

పల్లవి: చిత్రమె పాడునటే - నా
చిత్తమే ఆడునటే ॥చిత్రమె॥

ముచ్చటగా ఇపుడు మోహన
మూర్తియై మించునటే ॥చిత్రమె॥

అనుపల్లవి: నా హృదయం మీద - ఒక
నక్షత్రము పోలే -
పాదము పెట్టినదే చేరి
నావలె చూచునటే ॥చిత్రమె॥

చరణం: నా మనం నీదయితే - సుఖ
రాజ్యమె నాదెసుమా - ఎంత
మనోబలమో - మౌనం
ఏల సఖీమణికీ ॥చిత్రమె॥

---

పద్మినీ పిక్చర్స్ వారి "శభాష్ పిల్ల" చిత్రంలోనిదీ పాట.

పాడినవారు: ఘంటసాల

ఇది తమిళంలో "శభాష్ మీనా" అనే పేరుతో వచ్చింది. దాన్ని తెలుగులోకి డబ్ చేశాం. నేను శ్రీ శ్రీ గారి దగ్గర అసిస్టెంట్‌గా చేరిన కొత్తరోజులు మాటలూ, పాటలూ, శ్రీ శ్రీ గారే రాసేరు. అసిస్టెంట్‌గా డైలాగ్ డైరెక్టర్‌గా పని చేసేను. వారితో కలిసి నేను పని చేసిన ప్రతి డబ్బింగ్ చిత్రానికీ "డైలాగ్ డైరెక్షన్" "యు. సరోజ" అని టైటిల్ వేయించే వారు. ఒరిజనల్ వర్షనికీ తమిళ నిర్మాణ దర్శకులూ బి.ఆర్ పంతులుగారే। ఈ పాటంటే శ్రీ శ్రీ గారికి చాలా ఇష్టం. కొత్తగా వచ్చిన నాకు డబ్బింగ్ కోసం వారి దగ్గర ట్రయినింగ్ అయ్యే రోజులవి డైలాగ్స్ రాయటానికిచ్చిన శిక్షణలో

ఆ పక్క, ఈ పక్క లాటి మాటలు వాడితే నీ తూర్పు తెలుగు సినిమాలకి పనికి రాదని ముఖం వాచేటట్టు చీవాట్లు పెట్టేవారు. వారి దగ్గరకి వచ్చిన క్రొత్త రోజులు అయినా, ఒక్క క్షణం కూడా వారిని విడిచి వుండేదాన్ని కాను. దానికి తగ్గట్టు మాకు పిక్చర్ పనులు కూడా ఊపిరాడకుండా వుండేవి. ఈ పాట డబ్బింగ్ పాటంటే ఎవరూ నమ్మరు. నాకు కూడా ఈ పాటంటే చాలా యిష్టం.

సంగీతం తెలుగు వర్షన్ ట్రేక్సివాడేం. పాడినవారు ఘంటసాల. సాధారణంగా డబ్బింగ్ పాటలు రాసినపుడు కూడా నేను వెంట వుండాల్సిందే.

☆ ☆ ☆

# మంచితనం బలహీనతకాదు

పల్లవి: మంచి తనం - బలహీనతకాదు
కొంచెం ముందుంటే - కొదువనరాదు
ఒదిగుంటే అణగార్చే వారు
ఎదిరిస్తే దరికి వస్తారు
అదునూ పదునూ సమకూడాలి
సరిచూడాలి ॥మంచితనం॥

అనుపల్లవి: అల్లన మెల్లన వీచేగాలి
తుఫాను రూపం వహించదా
చల్లగ నల్లగతోచే మేఘం
మెరపుకొరడా ధరించదా॥

ఒక నిప్పుకణం దావానలమై
అరణ్యాలనే దహించదా ॥మంచితనం॥

చరణం: సెలలో కదిలే చిరుకెరటాలే
ఊరూవాడా ముంచేస్తాయి
మెరకాపల్లం ఏకం చేసీ
సమానత్వమే పంచేస్తాయి

మెతక మెతకగా నువ్వూరూకుంటే
బతకలేవురా భాయీ

కుట్టని తేలే - కుమ్మరి పురుగు
గుండె ధైర్యమే - అండగా నిలుచు ॥మంచితనం॥

---

మంచి తనం బలహీనతకాదని రాసేరే కాని! తన మంచితనంతోనే తనని వంచించే రన్న విషయం. వారికి తెలియకో లేక తెలిసే అతి మంచితనం వల్ల

వూరుకున్నారో; కాబట్టే శ్రీశ్రీ గొప్పవ్యక్తి మహామనిషి అనిపించుకోగలిగేరు. అదే మాట వారితో అన్నాను కూడా. కాని, నా నోరు గట్టిగానే నొక్కేశారు. నేనింకా గొడవ చేస్తే అవన్నీ నీకెందుకు సరోజా ఒక్క మాట మరిచిపోకు. నువ్వు నా 'నలుగురి పిల్లలకి అంకితం' నేను నా కలానికి, నా ప్రజలకి అంకితం ఏనాడో అయిపోయేను. నాకేవీ తెలీదనుకోకు! ఎవరి పాపం వారిది వదిలెయి! అనేవారు.

☆ ☆ ☆

# పతిపాద కమల సేవయు!

## (పద్యం మరియు పాట)

పద్యం పతి పాదకమల సేవయు
పతి పాదార్చకుల మీద భక్తియును
పతి వ్రతలకు సతతము హితమని
ప్రతి దినమును తలుపవలయు
పడతులు సుమతీ

అటు సూర్యుడిటు వాలనీ
యనటుల టకాయించినట్టి
యబలామణి
దటువంటి వంశమండీ

మటుమాయలు కావుమావి
మహిమలు సుమండీ
ఆ రీతి సంప్రదాయపు
పారంపర్యమున బుట్టి

పతి పాదము లాధారముగ బ్రతుకునేనీ
క్షీరములో నీరు వేరు చేయగ లేనా
పది తలల రావణాసురు మద
మణచగ జాలె నొక్క మహిళామణి

గులకరాళ్ళను తెచ్చి గుగ్గిళ్ళు చేసిన
అనసూయ మాయమ్మ కాది గురువు
యముని మెప్పించి వరములందుకొన్న సా
విత్రి మాయమ్మమ్మ మిత్రురాలు.

అమ్మమ్మయమ్మ మహా సాధ్వియైన
లోపాముద్రయంశలో ప్రభవమందె
ముత్తవ్వయవ్వ తా ముప్పొద్దులందున
సీతాసతీనామ చింత నవతి

నేనే అట్టి ప్రాణ పతీంద్ర చంద్రుని సదా
నిష్ఠాగరిష్ఠాత్మతో ధ్యానించే సిసలైన సాధ్వినయితే

పద్యం: నేనే సర్వజగద్భయంకర – మహానిష్ఠాత్మతో భోజనం
పానీయమ్మొదిలేసి రేబవలు నాప్రాణేశ పాదాలనే
ధ్యానించే సిసలైన సాధ్వినైతే – తానూగుచున్ – జోగుచున్
నానాధుండిక వచ్చు బాధ లొందకన్

---

ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి "అర్ధాంగి" చిత్రంలోనిదీ పద్యం.

☆ ☆ ☆

# ఇది నా పాట కాదు

పల్లవి: ఇది నా పాట కాదు – మూగవోయిన
కోటి గొంతుల – ప్రళయ ఘోష
ఇది పగిలిన గుండెలు పలికే భాష ॥ఇది నా పాట॥

అనుపల్లవి: ఎండి పోయిన చిగురాకు పాట
దారి తెలియని కన్నీటి పాట
కొండ కోనల చరియల నడుమ
విలపించే కృష్ణానది పాట ॥ఇది నా పాట॥

1వ చరణం: పరువపు వయసు బలి చేసి
పనికి మాలిన పట్టాలకోసం
పాఠశాలలను చెరశాలలలో'!'
డిగ్రీను ఉరి తాళ్ళను పొంది

చదువువ్యర్థమై – బతుకు భారమై
వీధంటే తిరిగే విద్యార్థి పాట ॥ఇది నా పాట॥

2వ చరణం: తన కండబలమే – మనదేశ ధనమై
లోలోనకుమిలే – శ్రమ జీవి పాట
రిక్షాలు తొక్కే ఎమ్.ఏ.ల పాట
భిక్షాటనాలు చేసే పంతుళ్ల పాట

బతుకు జూదాన పందెంవేసి
ఓడి పోయిన మేథావి పాట
అశాంతి పెరిగిన పేదల పాట
నిరాశనిండిన యువకుల పాట ॥ఇది నా పాట॥

3వ చరణం: ఏమిటి దీనికి కారణం
చించండి ఎగిరే తోరణం వా
యించండి విప్లవ వీరణం
మీరంతా కలిసి ఈ యిరుల
విరిచీ పంచండి ప్రజలకి "ఇది నా పాట॥

---

నవభారత్ ఆర్ట్స్ ఫిలిమ్స్ వారి చిత్రంలోని దీపాట.

☆ ☆ ☆

# కలిమి నిలువదు

కలిమి నిలువదు – లేమి మిగలదు
కలకాలమొకరీతి – గడవదు

నవ్వినకళ్లే చెమ్మగిల్లవా
వాడిన బ్రతుకే పచ్చ గిల్లదా
ఇంతేరా. ఈ జీవితం

తిరిగే రంగుల రాట్నమూ – బతుకే
రంగుల రాట్నమూ –

ఏనుగు పైన నవాబు
పల్లకిలోన షరాబు
గుర్రంపైన జనాబు
గాడిదపైన గరీబు – నడిచే
దారుల గమ్యమొక్కటే
నడిపే వానికి అందరొక్కటే //ఇంతేరా ఈ జీవితం//

కోరిక ఒకటి జనించు
తీరక ఎడద దహించు
కోరని దేదో వచ్చు
శాంతిసుఖాలను తెచ్చు – ఏది
శాపమొ – ఏది వరమ్మో తెలిసీ –
తెలియక అలమటించుటే //ఇంతేరా ఈ జీవితం//

త్యాగమొకరిది – ఫలిత మొకరిది –
అమ్మ ప్రాణమూ ఇద్దరిదీ –

విశాలాంధ్రలో ప్రజారాజ్య

వ్యధలూ - బాధలు - కష్టగాథలు, చివరికి
కంచికి వెళ్ళే కథలే //ఇంతేరా ఈ జీవితం//

ఆగదు వలపు - ఆగదు తలపు
ఆగదు జీవన మాగదు
ఎవరు కులికినా - ఎవరు కుమిలినా
ఆగదు కాలం ఆగదు. క్షణమాగదు. //ఇంతేరా ఈ జీవితం//

ఇరుగింటిలోన ఖేదం - పొరుగింటిలోన ప్రమోదం,
వాడిన పువ్వులు రెండూ - పూచే గుత్తులు మూడు
ఒకరి గుండెలో చీకటి రేయి
ఇరువురి మనసున వెన్నెల హాయి //ఇంతేరా ఈ జీవితం//

---

ఈ పాట రంగులరాట్నంలోనిది

సంగీతం: ఎస్. రాజేశ్వరరావు పాడినవారు: శ్రీ ఘంటసాల

ఆంధ్రుల అభిమాన సంగీత దర్శకులైన శ్రీ ఎస్. రాజేశ్వరరావుగారికి శ్రీశ్రీ అన్నా, శ్రీశ్రీ గారికి రాజేశ్వరరావు గారన్నా చాలా ఇష్టం. రాజేశ్వరరావుగారి సంగీత బాణీని శ్రీశ్రీ చాలా మెచ్చుకొనేవారు. అబ్బే రాజేశ్వరరావా దేవాంతకుడు ఏ మాట ఇయ్యి. ఆ మాటలోని భావార్థాన్ని తను చేసే మెట్టులో దింపేసేవరకు, వూరుకోరనేవారు. నాకెంతో సరదా వేసేది కారణం నేను రాజేశ్వరరావుగారి ఫేన్నీ. 1980వ సం.లో మేం అమెరికా వెళ్ళినప్పుడు సి.నా.రె.గారూ, రాజేశ్వరరావు గారూ ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం మంజూ భార్గవి బాలసుబ్రహ్మణ్యం గారి భార్యా, పిల్లలు, శైలజా, ఏడిద నాగేశ్వరరావుగారు అంతా ఒక చోట కలిసేం. తర్వాత రాజేశ్వరరావుగారు శ్రీశ్రీ, సి.నారే గారు మేము ఒకబ్యాచ్ అయి చికాగో నుండి మీటింగ్ కోసం పిట్స్‌భర్గ్ వెళ్ళి ఆంధ్రుల అభిమానతార జయప్రద బావగారైన పరంధామయ్యాగారింట్లోనే దిగి రెండు రోజులున్నాం. పరంధామయ్యగారి పట్టుదల, కోరికపై పిట్స్‌భర్గ్ వెంకటేశ్వరస్వామి వారిమీద ముఖ్యంగా శ్రీశ్రీ గారికి పాట రాయక తప్పలేదు. కవులిద్దరూ నువ్వెంత సేపు రాస్తావంటే, నువ్వెంతసేపు అనుకున్నారు. టైము లేదు. 5గం. మీటింగ్‌లో చదవాలి. నేనూ, శ్రీశ్రీ, రాజేశ్వరరావుగారికి అక్కడికి 150 కిలోమీటర్ల దూరంలోవున్న మిత్రునింటికి ఉదయం బ్రేక్ ఫాస్ట్‌కి వెళ్ళేం. రిటర్నవుతున్నాం. శ్రీశ్రీ పాటింకా రాయలేదు. సి.నారేగారు ఈ సరికి రాస్సే వుంటారు. మీరు ఓడిపోతారని నేను గొడవ ప్రారంభించేను.

మవ్వుండు నాయనా అన్నారు. అంతే నేనూ శ్రీ శ్రీ వెనక సీట్లో కూర్చున్నాం. ముందు సీట్లో రాజేశ్వరరావుగారూ కారు డ్రైవ్ చేస్తున్న మిత్రులు మరో 15 నిముషాల్లో ఇల్లు చేరుకుంటాం. సరిగ్గా 5 నిమిషాల్లో చక చకా శ్రీ శ్రీ బ్రహ్మాండంగా పాటరాసేసి, నా ముఖాన కొట్టేరు. ఎంత త్వరగా చకచకా శ్రీ శ్రీ పాటరాశారో – అంతేత్వరగా చక చకా 5 నిమిషాల్లో రాజేశ్వరరావు గారు ఆ పాటకి ట్యూన్ చేసేశారు. పోతే రాగాల ఎంపికలో ఇద్దరం 2 నిముషాలు డిస్కషన్ చేసుకొని ఆ పాట అద్భుతంగా చేసి ఆ రోజు రాత్రి శ్రీ శ్రీ సి.నా.రె.ల మీటింగ్ అయ్యేక రాత్రి 10 గం.లకి ప్రారంభించిన సంగీత కచేరీలో ఆ పాట హాయిగా పాడి అందరికీ వినిపించేశారు.

ఆరోజు రాజేశ్వరరావుగారి, పాట కచేరీకి, వైలెన్, వీణ, ఫ్లూట్ అక్కడి వాళ్ళే వాయిస్తారన్నారు కాని, మృదంగం కాని తపలా కాని వాయించే వాళ్ళు ఆ వూర్లో లేరు. ఏం చెయ్యాలి. నాకు తబలా రాదు. కాని, మృదంగంలో విద్వాన్ పాసయ్యాను. శ్రీ శ్రీ గారు ఆమాట బైటపెట్టేసరికి అందరూ నన్నుపట్టుకొని అప్పటికప్పుడే మృదంగం తెప్పించేశారు. ప్రాక్టీస్ లేదు. అయినా రాత్రి 10 గం. ప్రారంభించిన మా కచేరీ 1 గంటదాకా సాగింది. రాజేశ్వరరావు గారు హార్మోనియం వాయిస్తూ పాడి అమృత వర్షం కురిపించేరు. వారి ఫెవరేట్ సాంగ్స్ "తుమ్మెదా ఒకసారి" "బహుదూరపు బాటసారి" "పాడవేల రాధికా" అనుకుంటాను ఎంత బాగా పాడేరో చెప్పటానికి లేదు మా ప్రోగ్రాం వీడియో తీశేరు. రాజేశ్వరరావుగారి పాటకచేరీకి నేనూ ఒక ఆర్టిస్టుగా పాల్గొనటం నా అదృష్టంగా భావించేను. శ్రీ శ్రీ మా కెదురుగా కూర్చుని చాలా ఉత్సాహపరిచి, నా వాయిద్యానికి, మురిసి పోయేరు. నా జీవితంలో అదొకటి మరవలేని సంఘటన శ్రీ శ్రీ గారి ప్రోత్సాహంతో విదేశాల్లో చాలాచోట్ల నా సంగీత విద్యని పదిమందికి వినిపించే అవకాశం కలిగింది.

☆ ☆ ☆

# పట్నవాసం అంటే

పల్లవి: పట్నవాసం అంటే పై పైన పటారం
లోలోన లొటారం
కల్తీ బేరం - కంట్లో కారం - కాకి బంగారం
ఉల్టా - సీదా ఇంతే కాదా - దీని బండారం॥పట్నవాసం॥

అనుపల్లవి: కూడూ గూడూలేని
పేదల గోడే చూడదు
మేడా మిద్దే ఎవడికి ఉంటే
వాడే లీడరు
సూటూ - బూటూ, నీటుగ వేస్తే
గొప్పనుకుంటాడు
ఖద్దరు పంచ కట్టినవాడ్ని
మొద్దనుకుంటారు
భారత మాత దాస్యం
బాధతొలగించిందీ - ఖద్దరుకాదా ॥పట్నవాసం॥

చరణం: పగలూ రేయీ - అసలూ నకిలీ
తేడా తెలియదు -
ఆడది యెవరో - మగవాడెవరో
ఆరా దొరకదు
చిన్నా పెద్దా మంచీ చెడ్డల
విలువే మారింది
వెనుకటి రోజుల నీతి
నిజాయితి కరువేపోయింది

అయ్యయ్యయ్యో - ఓరి నాయనో
ఈ మనదేశం - ఎటుపోతోంది //పట్నవాసం//

---

పద్మాలయా పిక్చర్స్ వారి చిత్రంలోనిదీ పాట.

26-8-77లో ఈ పాటరాసేరు. ఒకసారి మందవల్లిలో ఉన్న మాయింటి మేడ మీద ఆరోజు పౌర్ణమి. బాగా జ్ఞాపకం ఓపెనెయర్లో నడుం వాల్చి శ్రీశ్రీ గారు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో పట్నవాసం అంటే పైపైన పటారం అన్నమాట అక్షరాల నిజం అండీ అన్నా! ఏం ఏం జరిగిందేవిటి పొట్టీ అన్నారు. నేనూ అందరిలాగే మద్రాసులో బ్రతికేద్దామని అలాగే చదువు కుందాం అని కూడా వచ్చేనండీ! ఆ రోజుల్లో నాకన్న ముందుగా వచ్చిన పి. సుశీలతో కలిసి హెచ్.ఎమ్. రెడ్డిగారి కంపెనీకి వెళుతూ వుండేదాన్ని (నేనూ సుశీ ఒకే ఇంట్లో ఉండేవాళ్లం) రెడ్డి గారు నా గురించి సుశీని ఎవరీ అమ్మాయని అడిగితే మా కజినని సుశీ చెప్పింది. రెండు మూడు సార్లు ఆ కంపెనీకి వెళ్ళేక నేనోసారి రెడ్డిగారిని నాకు ఏక్ట్ చెయ్యాలని వుంది, అవకాశం వుంటే ఇస్తారా? అని అడిగేను నా మాటకి రెడ్డిగారు మంచి కళ్ళూ, మంచి ఫేస్, కెమేరా ఫేసే కాని, ఏం చెయ్యనమ్మా మరీ అంత చిన్నదానివీ కావు పెద్దదానివీ కావు అనేశారు. అలాగే ఎల్.వి. ప్రసాద్‌గారు రెడ్డిగారే కెమెరా ఫేస్ అని అన్నారంటే ఇంకేం కావాలమ్మా బొత్తిగా ఎటూ కాని వయసు అని అనేశారు. ఎల్.వి. ప్రసాద్‌గార్ని నాన్నగారూ అని వారి భార్యను, అమ్మా అని పిలిచేదాన్ని. వారింట్లో పెంపుడు బిడ్డలా వుండేదాన్ని. అక్కడితో చిరాకేసి ఆమాటే వదిలేశా. కాని అనుకోకుండా ఒక ప్రొడ్యూసర్ నన్నూ కృష్ణకుమారినీ (హీరోయిన్) మేకప్ టెస్ట్‌కి పిలిచేరు. కెమేరా ఫేసమ్మాయి కొంచెం పెద్దదానివయితే బాగుండేది. అయినా చూద్దాంలే అంటూ! ఆ రోజే సాయంకాలం 6 గం.లకి కారుతో వస్తాను! సరదాగా బీచికి వెళ్లి వద్దాం అన్నాడాయన. (అతని పేరు అనవసరం అనుకోండి. శ్రీశ్రీకి చెప్పేనుచాలు) అంతేనండి బాబూ. తక్షణం ఇంటికొచ్చి తెలిసిన మిత్రుని దగ్గర అప్పుచేసి ఆ రాత్రికి రాత్రే మావూరికి మా అమ్మతో సహా కలకత్తా మెయిల్ ఎక్కేశాను. తర్వాత రెండవసారి వచ్చినప్పుడు ఈ సినీమాలో యాక్టింగ్ సంగతే వద్దనుకొని, మ్యూజిక్ కాలేజీలో జాయిన్ అయి పోయేనండీ అన్నా! నేనలా అనేసరికి విరగబడి నవ్వేరు. అంటే సాధారణంగా శ్రీశ్రీగారు ముసిముసి నవ్వులూ, చిరునవ్వులే కాని అందరిలా

చప్పుడయ్యేలా నవ్వారు. అలా నవ్వేసి ఏమ్మసలీ, నీకు యాక్ట్ చెయ్యాలని వుందా అని అడిగేరు. నా మొహం వూసిపోక ఏదో వాళ్ళని అడిగేనే కాని! నా మొఖానికి యేక్టింగ్ ఏవిటండీ! అసలా మాట తల్చుకుంటేనే నా కిప్పటికీ గుండెలో దడపుడుతుంది. మీకు అసిస్టెంట్‌గా భార్యగా సెట్టయిపోయిన ఈ జీవితమే చాలండి నాకు శ్రీశ్రీ భార్య అనిపించుకునే అదృష్టం ఎందరికి పడుతుంది అన్నా! నిజంగానే అదంతా నామీద లవ్వేనేవిటి అన్నారు. నా జీవితంలో మరవలేని సంఘటనల్లో అదొకటి.

☆ ☆ ☆



# సత్యమే నిత్యమూ సిద్దన్నా!

పల్లవి: సత్యమే నిత్యమూ సిద్దన్నా
సత్యమూ తెలిసేను సిద్దన్నా
మంచి మర్మములేవొ సిద్దన్నా
తెలియజెప్పర నీవు సిద్దన్నా

అనుపల్లవి: పొంచి దాగితె నిన్ను సిద్దన్నా
ఎంచి దొంగంటారు సిద్దన్నా
పడగెత్తి సర్పాలు సిద్దన్నా
పడగొట్టనున్నాయి సిద్దన్నా
బుట్టలో పెట్టాలి సిద్దన్నా – పట్టి
బుట్టలో పెట్టాలి సిద్దన్నా ||సత్యమే||

1వ చరణం: చెప్పలేదూ మాట సిద్దన్నా
చేసి చూపేవాడు సిద్దన్నా
మనసు కలిగుంటాడు సిద్దన్నా
మిత్రుడే వీడెపుడు సిద్దన్నా ||సత్యమే||

2వ చరణం: తిన్ననీ ద్వారేదొ సిద్దన్నా
చెన్నడే చూపాడు సిద్దన్నా
మంచి వారికి మంచి సిద్దన్నా
మంచిగా నను నమ్మ సిద్దన్నా ||సత్యమే||

శ్రీ ఫిలిమ్స్ వారి "కొల్లేటి కాపురం" చిత్రంలోనిదీపాట.

సంగీతం: పెండ్యాల పాడినవారు: కె.వి. రవి

ఇక్కడో విషయం చెప్పాలి. అబద్దాలాడే వాళ్ళని చూస్తే శ్రీశ్రీగారికి ఎంత అసహ్యమో చెప్పలేం. ఆలస్యంగా వారింటి కొచ్చిన రోజున భోంచేశావా

సరోజా అని అడగ్గానే ఆ చేసేనండి అని అనే సరికి ఎందుకు సరోజా అబద్ధాలాడతావు అని విసుక్కొనేవారు. తెలిసీ కూడ ఎందుకండి అడగటం మీ రొస్తే కాని నేను తినవని అనే సరికి తినలేదని చెప్పొచ్చుగా అంటే; ఇంత చిన్న విషయానికీ అంత కోపం దేనికండీ అనే దాన్ని. అదికాదు సరోజా ఏ విషయానికైనా అబద్ధం ఆడటం ఎందుకంటాను? ఒక అబద్ధానికి వెయ్యి అబద్ధాలు ఆడాల్సి వస్తుంది నిజానికి తిరుగులేదు. అబద్ధం ఆడే వాళ్ళంటే నాకు అసహ్యం అనీ నీకు తెలుసు కదా అనే వారు. నేరకపోయి ఆడేనురా బాబూ, వారి మూడే చెడగొట్టేనని బాధపడేదాన్ని!

☆ ☆ ☆

# చలో అచట పక్షులవలె

పల్లవి: చలో అచట పక్షులవలె స్వేచ్ఛవైపు
చలో ఇచట అలలు చేర్చుదీవి వైపు
ఒకే మాటగా - ఒకే బాటగా ఇలాగే
స్వతంత్ర గీతి పాడుచూ ||చలో అచట||

అనుపల్లవి: గాలి మనల బానిసలమని తాకమానదే
కడలి నీరు బానిసలని మరిగి పొంగదే
కాలమైన మనల వీడి కదలజాలదే
ఖ్యాతి, ప్రీతి, నీతి మనల మరువ జాలదే||చలో అచట||

1వ చరణం: జననవేళ జనని లేక పుట్టలేదుగా
పలుకు వేళ మాటలేక పలుకలేదుగా
బ్రతుకువేళ పనికి మాలి బ్రతుకలేదుగా
మరణ వేళ మరోదారి పట్టలేదుగా
కోటి ప్రజలు చేరి పాడవలెను స్వేచ్ఛగా||చలో అచట||

2వ చరణం: సాటిలేని జన్మహక్కు మనకు స్వేచ్ఛగా
భీతి లేని జాతికెపుడు కలదు విడుదలా
భూతలాన బానిసలకు దొరకు విడుదలా||చలో అచట||

---

గౌరి ఫిలిమ్స్ వారి "కథానాయకుడు కథ" చిత్రంలోనిదీ పాట.

దర్శకత్వం: బి.ఆర్. పంతులుగారు
సంగీతం: కోదండపాణి పాడినవారు: మాధవపెద్ది సత్యం, బృందం

పాటలన్నీ శ్రీశ్రీ గారే రాసినట్టు టైటిల్స్పిక్చర్ పాటలపుస్తకంలో వున్నాయి. ఈ పాట ఫేర్ చేస్తూంటే ఒక విషయం జ్ఞాపకం వస్తోంది. నేను శ్రీశ్రీకి అసిస్టెంట్‌గా పనిచేస్తున్న రోజుల్లో నా వల్ల వారికి కొన్ని

సాంగ్స్ పోయేయని కచ్చితంగా చెప్పగలను. కారణం రాస్తున్నాను. నేనెవర్నీ నిందించటం ఎంత మాత్రం కాదు. మా ఇద్దరి జీవితంలో ఇదొక అనుభవం అని మాత్రమే రాస్తున్నాను. ఈ చిత్రంలో మొత్తం మాటలూ, పాటలూ కూడా శ్రీ శ్రీ గారే రాయాల్సింది. కాని రాత్రికి రాత్రే కొన్ని మార్పులు జరిగిపోయేయి. మేము ఏఁవీ బాధపడలేదు కాని కారణం తెలీక ఆశ్చర్య పడ్డాం. పాటలన్నీ రాసి రికార్డింగ్ అయి పిక్చర్ విడుదలయాక విషయం బైటపడింది. అదేమిటంటారా! రూమర్ శ్రీ శ్రీ అసిస్టెంట్ సరోజుందే అమ్మ బాబోయి ఆమెతో సావ్లేమండి. శ్రీ శ్రీ రాసిన ప్రతి దాంట్లోనూ చెయ్యి పెడుతుంది. అసలు ఆయన రాయరు. ఆవిడే రాస్తుంది. పాటలు కూడ ఆవిడే రాస్తుంది అని ప్రచారంచేసి, మాకు రావలసిన డబ్బింగ్ పిక్చర్లు కూడ రాకుండా చాలా అవస్థలు పడ్డారు. అది వేరే విషయం అనుకోండి. నిజంగా నాకు పాటలు కూడా రాయడం చేతనైతే, నన్ను శ్రీ శ్రీగారే ఫీల్డుకి పరిచయం చేసేవారు. మాటలంటారా నిజంగానే నేను బాగా రాయగలను. (డబ్బింగ్ చిత్రానికి) ఈ పిక్చర్లో పాటల రికార్డింగ్ జరిగినపుడు ఏ ఒక్క పాటకీ నేను వెళ్ళలేదు. ఈ మాట విని ఇద్దరం నవ్వుకున్నాం.

☆ ☆ ☆

# బి.ఏ.చదివాం ఎమ్.ఎ.చదివాం

పల్లవి: బి.ఎ. చదివాం – ఎమ్.ఎ. చదివాం
అమ్మా నాన్నకు – కాకున్నాం
ఊరూ పేరూ – లేకున్నాం
అయినా ఇంకా బతికే ఉన్నాం ॥బి.ఎ. చదివాం॥

అనుపల్లవి: కాలేజీల్లో సీట్లు లేవనీ
డొనేషన్లకే దొరుకుతాయనీ

డిగ్రీలున్నా పనుల్లేవనీ
చెయ్యితడిపితే పలుకుతాయనీ
అనకూడదురా అది మననోట – అంటే
మనగతి అంతేరా బేటా ॥బి.ఎ. చదివాం॥

1వ చరణం: నడిబజారులో హత్య జరిగినా
నలుగురు చేరి స్త్రీని చెరిచినా
శాంతి భద్రతలు కరువైనాయని (షైరెల్లాయని)
అనకూడదురా మనమామాటా
అంతా ఓకే అనరా బేటా ॥బి.ఎ. చదివాం॥

2వ చరణం: సరుకుల కల్తీ సాగిపోయినా
దినుసుల ధరలే చుక్కలంటినా
కరువులు చావులు పెరిగి పోయినా
కారణ మెవరో తెలిసిపోయినా

అనకూడదురా అంతటి మాటా
వాళ్లే రైటని అనరా బేటా ॥బి.ఎ. చదివాం॥

---

16.6.75లో ఈ పాటా రాశారు. ఈ ఒక్క పాట మూడు రకాలుగా రాశారు. ఈ మూడూ చాలా బాగున్నాయి.

☆ ☆ ☆

# ఎవరొస్తారో-ఎవరొస్తారో!!

అతడు:

పల్లవి: ఎవరొస్తారో - ఎవరొస్తారో
తొలిపండుగ - కనువిందుగ
ఈ పేదల - పూరింటికి ॥ఎవరొస్తారో॥

ఆమె:

అనుపల్లవి: ఎవరొస్తారో- ఎవరొస్తారో
సూర్యుడి లా - చంద్రుడిలా
ఈ పేదల - పూరింటికి ॥ఎవరొస్తారో॥

అతడు:

1వ చరణం: సూర్యుడే పుట్టినా - చంద్రుడే పుట్టినా
వెలుగుల రేఖలే - వెదజల్లే వాడు

ఆమె: లోకాల పీడించు - శోకాల చీకట్లు
విదలించుకీర్తితో - విలసిల్లే రేడు ॥ఎవరొస్తారో॥

2వ చరణం: కులమత భేదాలు - తొలగించేవాడు
విజ్ఞాన దీపాలు - వెలిగించేవాడు

అతడు: నలుగురినీ మెప్పించి
మొనగాడే అనిపించి
నిరుపేద తనమునే
రూపుమాపే వాడు ॥ఎవరొస్తారో॥

---

సంగీతం: రామకృష్ణ పాడినవారు: రామకృష్ణ, బెంగుళూరు లత

17-1-79లో ఎ.వి.ఎమ్. స్టూడియోలో రికార్డింగ్ అయింది.

☆ ☆ ☆

# అన్నా అన్నా భయంలేదు!!

పల్లవి: అన్నా అన్నా అన్నా భయంలేదు
భయంలేదు కదలిరా

అనుపల్లవి: చెల్లీ చెల్లీ చెల్లీ – జయం మనది
జయం మనది – కలసిరా
భయంలేదు – భయంలేదు కదలిరా
జయం మనది జయం మనది కలసిరా॥అన్నా అన్నా॥

1వ చరణం: కష్టం చాలని కార్మికులందరూ
కడుపులు మండీ సమ్మెలు చేస్తే
అదేపాపమని – అదే నేరమని
ఎన్నాళ్ళింకా బెదరిస్తారు
భయంలేదు భయంలేదు కదలిరా ॥అన్నా అన్నా॥

2వ చరణం: కసుగందులకు గంటెడు పాలు
బీద జనాలకు పిడికెడు నూకలు
ఎండకు వానకు నిలిచే కొంపలు
ఇంతకన్న మన మడిగిందేమిటి?
జయం మనది జయం మనది కలసిరా॥అన్నా అన్నా॥

3వ చరణం: శ్రమతో సంపద పెంచిన చేతులు
చాలని కూలికి చాచిన చేతులు
ఒకే పిడికిలిగా మారిన రోజున
పెళ – పెళ పగలవా – సంకెళ్లు
జయం మనది – జయం మనది – కలసిరా
భయం లేదు –
భయం లేదు – కదలిరా ॥ అన్నాఅన్నా॥

---

"స్త్రీ" చిత్రం లోనిదీ పాట

పాడినవారు: పి. సుశీల, బృందం

# మనిషే మణిదీపం

పల్లవి: మనిషే మణిదీపం
మనసే నవనీతం
మనిషే మాణిక్యం
మెరిసే వైడూర్యం
కన్నుల్లో అనురాగం
గుండెల్లో అనుతాపం //మనిషే//

అనుపల్లవి: ఈమె పేరే మంచితనం
ప్రేమ పెంచే సాధు గుణం
ఈమె తీరే స్నేహ ధనం
వాడకంతా ఆభరణం
ఈమె పలుకే ముద్దుగులికే
తేనె లొలికే తీయదనం //మనిషే//

చరణం: పెళ్ళిపల్లకీ – హరివిల్లు
చుక్కలే అక్షింతలు జల్లు
సంజకెంజాయె పారాణి
లేతమబ్బులే సాంబ్రాణి

పిల్లగాలులే ప్రేక్షకులు – దేవదూతలే రక్షకులు
ఎదురు చూసిన తొలిరేయి – ముది కురులే చెదిరాయి
నిదుర మరచిన నడిరేయి
అంతలోనె తెల్లవారి వింతకలలే కరిగాయి //మనిషే//

గోదావరి చిత్రవారి "మంచుపల్లకి" చిత్రంలోనిదీపాట.
సంగీతం: రాజన్ - నాగేంద్ర పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం
15–2–82వ తేదీన జెమినీలో ఈ పాట రికార్డింగ్ అయింది.

☆ ☆

# అన్యాయాలకు బలియై పోయిన!!

**పల్లవి:** అన్యాయాలకు బలియైపోయిన
అనాథులారా రారండి
కన్నులు కానని కామందులపై
కత్తి కటారులు నూరండి
నెత్తురు మంటలు లేపండి //అన్యాయాలకు//

**అనుపల్లవి:** నిరుపేదలారా - శ్రమజీవులారా
కండలు పిండీ - సంపద పెంచే
కాయకష్టమే - పేదలవంతూ
రాగభోగముల - తూగుటుయలల
ఊగులాడడం - పెద్దల వంతు
పంచుకు తింటే పాయసము
దోచుకుతింటే విషాన్నము
చావులేని ఈ సత్యం మనము
వాడ వాడలా చాటిస్తాం //అన్యాయాలకు//

**చరణం:** కుల మత భేదంతో కట్టిన గోడలు
నిలువవు మనముందు
నేలా నీరూ గాలీ అందరి
సొంతం మన ముందు
దేవుడి పేరిట చేసే మోసం
సాగదు ఇక ముందు
మేలుకున్న మన మానవ శక్తికి
ఎదురు లేదు ఈ జగమందు
పదండి రా - పదండిరా
పగ సాధించగ - ప్రతిజ్ఞ బూని,
ప్రళయం లాగ - పదండిరా పదండిరా //అన్యాయాలకు//

---

పద్మనాభం తీసిన మురళీ ఆర్ట్స్‌వారి "కథానాయిక మొల్ల" చిత్రంలోనిదీపాట.
సంగీతం: కోదండపాణి పాడినవారు: పి. సుశీల

# సొగసు కీల్జడదానా!

పల్లవి: సొగసు కీల్జడదాన
సోగ కన్నుల దాన

వజ్రాలవంటి పల్వరుస దాన
బంగారు జిగిదాన

నయమైన
ఒయ్యారి నడల దాన
దోరంపు కంటిదాన

తొణుకు సిగ్గుల దాన
పిడికిట నడుగు
నెన్నడుము దాన

మురిపించే అందాలే
అవినిన్నే చెందాలే
నాదానవు నీవేలే
నీ వాడను నేనేలే

దరిచేర రావే సఖీ – నా సఖీ
ప్రేయసీ సిగ్గేలా ॥సొగసు కీల్జడదాన॥

అనుపల్లవి: మరపించే మురిపాలే
కరగించే కెరటాలై
నిదురించే భావాలా
కదలించే ఈవేళా
అదే హాయి కాదా – సఖా – నా సఖా ॥మరపించే॥

చరణం: తొలి చూపే మంత్రించెనే
ప్రియ సఖురూపు
మది నేలేనే

ఇద్దరూ: ఇది ఎడబాటుకనలేని ప్రేమా
ఇల మనకింక సురలోక సీమ

ఇదే హాయి కాదా సఖా నా సఖా ॥మురిపించే॥

అనురాగాల రాగాలలో

నయగారాల గారాలలో

ఇద్దరూ: మధు మాధుర్యమే నిండిపోయె
హృదయానందమే పొంగిపోయె

దరిచేర రావే – సఖీ – నా సఖీ
మురిపించే మురిపాలే ॥సొగసు కీల్జడదాన॥

---

సీతారామయ్యగారు తీసిన "బొబ్బిలియుద్ధం" చిత్రంలోనిదీ పాట.

*సంగీతం:* **యస్.రాజేశ్వరరావు** *పాడినవారు:* **ఘంటసాల, పి. సుశీల**

☆ ☆ ☆

# ఏది సత్యం, ఏది నిత్యం!!

పల్లవి: ఏది సత్యం ఏది నిత్యం
ఏది జీవిత వాస్తవం

ఇపుడే ఇపుడే చదువుతున్నా
తెరచి జీవిత పుస్తకం
తెరచి జీవిత పుస్తకం //ఏది సత్యం//

అనుపల్లవి: నింగి నుండే దేవతలకు
కొండలన్నీ నున్నలే

కొండనుండే చిన్న చీమకు
దారిపొడుగునా గతుకులే //ఏది సత్యం//

1వ చరణం: అంతులేని కడలి లోతుకు
హడలి పోవడమెందుకు

దూకితేనే ధైర్యశాలికి
దొరకు రతనపు రాసులు //ఏది సత్యం//

2వ చరణం: తరంమారి ఉదయించారు
భావినేలే తారలు

గతంమారి ప్రభవించారు
స్వర్ణయుగ విధాతలు

పావన - నవజీవన - బృం
దావన - నిర్మాతలు //ఏది సత్యం//

---

విశ్వభారతి వారి "తరం మారింది"చిత్రంలోనిదీ పాట.

☆ ☆ ☆

# హోయిగా ఆలూ మగలె

పల్లవి: హోయిగా ఆలూ మగలై
కాలం గడపాలి వేయేళ్లు
మీరనుకూలంగా – ఒకటై బతకా //హోయిగా ఆలూ//

ఆమె: సతి ధర్మం పతి సేవేయని–
పతి భక్తిని చూపాలి
అనుదినము అత్తమామల
పరిచర్యలనే చేయాలి.
పతి ఇంట్లో బంధుజనాల
అభిమానం పొందాలి
పదిమందీ నీ సుగుణాలే
పలుమార్లూ పొగడాలీ //హోయిగా ఆలూ//

అతడు: ఇల్లాలే ఇంటికి వెలుగని
యెల్లప్పుడు తెలియాలి
సంసారపు బండికి మీరే
చక్రాలయి తిరగాలి
శరీరాలు వేరేగాని
మనసొకటై మసలాలి
సుఖమైనా కష్టమైనా
సగ పాలుగ మెలగాలి //హోయిగా ఆలూ//

ఆమె: ఇరుగమ్మల పొరుగమ్మలతో
ఇంటి సంగతులు అనవద్దు

చీరలు నగ లిమ్మని భర్తను
చీటికి మాటికి అడగొద్దు

అత్తింటను అదరి పాటుతో
పుట్టింటిని పొగడొద్దు

తరుణం దొరికిందే చాలని
తలగడ మంత్రం చదువొద్దు

హాయిగా ఆలూమగలై
కాలం గడపాలి

అన్నపూర్ణా వారి "మాంగల్య బలం" చిత్రంలోనిదీ పాట.

సంగీతం: వేణు　　　　　　పాడినవారు: పి. సుశీల, బృందం

దర్శకత్వం: ఎ. సుబ్బారావు

అన్నపూర్ణావారి పాటలన్నీ చాలా బాగుంటాయని చెప్పక తప్పదు! కారణం విప్లవ కవిత్వానికి మాత్రమే శ్రీశ్రీ పనికొస్తారని వాళ్ళు భావించక పోవడమే అందుకు ముఖ్యకారణం. రాయించుకో గలిగినా రాసినా ఏ కవి అయినా ఇతరులకు కావాలనుకున్నది, తనురాయాలనుకున్నది రాయగలడని అన్నపూర్ణావారి చిత్రాలలో చూడొచ్చు. అందుకు శ్రీ దుక్కిపాటి వారి ప్రోత్సాహం సహనం అటువంటిది.

☆ ☆ ☆

# మగవారల లొంగదీయు!!

పద్యం: మగవారల లొంగదీయు
మార్గమ్మిదియే

మగవారలపై మగువలు
జగడాలకు దారితీయు

సమయములందున్
పొగడవలె తీయ - ప్రే

మగవారల - లొంగదీయు
మార్గమ్మిదియే!!.........

భవానీ ఫిలిమ్స్‌వారి "మాయని మమత" చిత్రంలోనిదీ పద్యం.

సంగీతం: అశ్వద్ధామ    పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం

☆ ☆ ☆

# ఇది విషాద విప్లవగేయం

పల్లవి: ఇది విషాద విప్లవ గేయం – అశాంతి.
యువకుల గుండెల గాయం –
వేయికన్నులు వెదికేబాట
కోటి గొంతులు పాడే పాట //ఇది నాపాట//

అనుపల్లవి: ఇది నా పాట కాదు – మూగ వోయిన
కోటి గొంతులు పాడే పాట
ఇది పగిలిన గుండెలు పలికే భాష
ఆశ నిరాశగ మారిన దేశపు

ఆవేదనే ఈ పాట
సెలయేరూ, కన్నీళ్లూ – కలిసి పాడిన పాట
చిరునవ్వులు చీకటిలో కరిగి పాడినపాట
ఆశ నిరాశగ మారిన
నాదేశం పాడినపాట //ఇది నాపాట//

1వ చరణం: యువలోకపు మధుర స్వప్నం
విషపూరిత మయిందని
నవ జీవన బృందావని
మరుభూమిగ మారిందని

నిరాశతో – నిస్పృహతో
ఎన్నాళ్లీ కన్నీళ్ళని
ఆకాశపు చీకటినే
ప్రశ్నించేపాట //ఇదినాపాట//

2వ చరణం: ఇది నాపాట కాదు మూగవోయిన
కోటిగొంతుల ప్రళయ ఘోష!
ఇది పగిలిన గుండెలు పలికేభాష
ఎండిపోయిన చిగురాకు పాట

దారి తెలియని కన్నీటి పాట
కొండల కోనల – చెరియల నడుమ
విలపించే కృష్ణానది పాట //ఇది నాపాట//

---

శ్రీశ్రీ రాసుకున్న పాట ఇది అచ్చు అయిందో లేదో సందేహం. సినిమాకి రాసేరో దేనికి రాసేరో తెలీలేదు. ఇలాంటివి చాలా పాటలు జానపదాలు లలిత సంగీతానికి రాసినవి చాలా పాటలు అచ్చుకాకుండా వున్నాయి. అవన్నీ ఫేర్ చేసి ముద్రణకి పంపుతాను. అచ్చుకాలేదని నేను అనుకున్నా, ఒకవేళ అచ్చయేయనో లేక సినిమాలో వచ్చేసిందనో ఎవరైనా అన్నా ఆశ్చర్య పడటానికి లేదు ఎందుకంటే ఇంత మంచి సాహిత్యం అచ్చుకాకుండానో సినిమాలో రాకుండానో వుండటం అసంభవం అదీకాకుండా మా చేతికి అందని శ్రీశ్రీ ఖజానా ఒకటుందిలెండి. అందులోకి ఇది ఏనాడో వెళ్ళిపోయివుంటుందని నా వుద్దేశం ఏవయితే ఏం మళ్లీ ముద్రించటంలో ఏ మాత్రం తప్పులేదు. ఇదే పాట వేరే విధంగా శ్రీ సత్యసాయీ వారి చిత్రంలో రాసేరు.

☆ ☆ ☆

# జయమ్ము నిశ్చయమ్మురా

పల్లవి: జయమ్ము నిశ్చయమ్మురా
భయమ్ము లేదురా
జంకు గొంకు లేక – ముందు
సాగి పొమ్మురా //జయమ్ము//

అనుపల్లవి: కష్టాల కోర్చుకున్న నే
సుఖాలు దక్కును
ఈ లోకమందు సోమరులై
ఉండకూడదు

పవిత్రమైన ఆశయాలు
మరువ కూడదు

బీద సాదల నాదరించు
బుద్ధిని విడువకూడదు

అప్పుడే నీకు జయమ్ము నిశ్చయమ్మురా
భయమ్ము లేదురా జయమ్ము నిశ్చయమ్మురా

"శభాష్ రాముడు" చిత్రంలోనిదీ పాట.

పాడినవారు: ఘంటసాల

☆ ☆ ☆

# చిరుపాట

చీలిపోయెను మనసులూ
చెదరి పోయెను మమతలూ

ఎడ పెడ దారుల పయనంలో
ఇరువురిగమ్యం ఒకటే అయినా
మాగల కలయికా ఏనాడో!!

శ్రీ ఫిలిమ్స్‌వారి "కొల్లేటి కాపురం" చిత్రం లోనిది.

దర్శకత్వం : తిలక్
సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు
పాడినవారు : పూర్ణచంద్ర రావు

☆ ☆ ☆

# యమునా ముఖమున్

పల్లవి: యమునా ముఖమున్ కనవే
నీకలుకా పరాకదేలో
అలుకా పరాకదేలో ॥యమునా॥

అనుపల్లవి: హృదయం ప్రేమకె దాసిని చేసే
నీ చెవి పూావుల బాల
పరిమళ మిందే వాడునో ఏమో
వెన్నెల వేళా అడగరాదా --
అలుకా పరాకదేలో - అలుకా పరాక దేలో ॥యమునా॥

చరణం:- మది నా ఆశకె ప్రాణం పోసి
మర చేవ్రా చందమామా
చెలిపై చలము ఇకపై విడుము
వెన్నెల వేళా - అడగరాదా
అలుకా పరాకదేలో
అలుకా పరాకదేలో ॥యమునా॥

---

చందమామా ఫిలిమ్స్‌వారి "రత్నగిరి రహస్యం" లోనిదీపాట.

"తంగమలై రహస్యం" అనే అరవ చిత్రాన్ని డబ్బింగ్ చేశారు. మాటలు పాటలు శ్రీశ్రీ రాసేరు. నేటి సరోజా శ్రీశ్రీ నాటి యు. సరోజగా డైలాగ్ డైరెక్షన్ చేసింది. సంగీతం టి.జి. లింగప్ప ఈ చిత్రం ఆంధ్రదేశంలో 75 రోజులు ఆడింది. "దేవదాసు" తీసిన డి.ఎల్. నారాయణగారు దీన్ని డబ్ చేశారు. ఈ పాట పాడింది. పి. సుశీల. ఈ చిత్రం 3 వారాలు ఆడితే నాకు మంచి ప్రజెంటే ఇస్తానని మావారు అన్నారు. అంతకన్న ఎక్కువ రోజులే ఆడుతుందని, వారితో పందెం కట్టేను. నేను ఓడిపోతే వారికి వెయ్యి నూట పదహార్లు ఇవ్వటానికి గెలిస్తే వారు నాకు పడమటి చంద్రహారం చేయించటానికి ఒప్పందం చేసుకున్నాం. పిక్చర్ రిలీజ్‌కి బెజవాడ వెళ్లేం. ఫస్ట్‌షో అయిన వెంటనే ఆర్డరిచ్చి మూడు పేట్ల చంద్రహారాలు చేయించేశారు. డి.ఎల్. గారు నీ పనే బావుందమ్మాయి అని నవ్వేరు.

# ఓరయ్యో దేవుడా!

పల్లవి: ఓహో రయ్యో దేవుడా
ఓ భగవంతుడా
చూడవా - నీ సృష్టి - సోయగాలు //ఓరయ్యో//

అనుపల్లవి: ఏమూలగనిన నారీ మానభంగాలు
ఏ చోట జనిన - బలేమోసగాళ్లు

నీవు నిర్మించిన - నింగిపై కెగబ్రాకే
భువిలో సమస్త - వస్తువుల ధరలు //ఓరయ్యో//

చరణం: మామూళ్ళు లేనిచో మాట్లాడ తరమౌనా
ఔరౌర కార్యాలయముల్లో యముళ్ల.

అధికారమునకు పర్యాయ పదమాయెను
అవినీతి దానికే అదుపులేదు.

విద్యలార్జించి నిరుద్యోగులైనారు
నాలాగ వేలకు వేలు జనులు

గుడిలోన పందికొక్కుల వంటి పూజార్లు
వెలుపల వంద వందల బికార్లు

చిన్న నౌకరుపనికి - బారుబారు సిఫార్సులు
దాని పక్కనే కులతత్వ ఘోష

నీ ప్రపంచమే కల్తీల నిలయమాయె
దొంగలే నీయనుంగు భక్తులైనారు

ఉన్నవారిని కాపాడుచున్నవాడ
లేనివారి సొద వినలేవు నీవు //ఓరయ్యో//

విశాలాంధ్రలో ప్రజారాజ్యం

# ఓ..ఓ..కన్నయ్య పుట్టినరోజు!

పల్లవి: ఓ. ఓ. కన్నయ్య పుట్టినరోజు మా
సిన్నయ్య పుట్టినరోజు
మాదొర కనుల పండుగ నేడు

అనుపల్లవి: మనసు జిల్లని - ఒళ్ళు ఝల్లని
వెలుగు పంటలు - బతుకునిండే
కన్నడు పుట్టిన రోజే ఓ...ఓ...రండి.
రండి - రండిర - రండిర - పండగ వేళా//ఆ....ఆ....//
చిన్నలు పెద్దలు కన్నడి విద్దెలు సూడ //కన్నయ్య//

చరణం: కన్నయ్యే అగ్గి బరాటా!
చిన్నయ్యే చిచ్చుల తూటా
సాటిలేని మేటి దొరగా
జాజీరే - జాజీరే - వరేవా
ఇదే - ఇదే - బలే - బలే వేడుకా //కన్నయ్య//

చరణం 2.:- ఆడుదొరా - వేటాడు దొరా
మేమంతా - నీకుతోడుదొరా!
ఎర్రగనువ్వే చూశావంటే
ఎదురే ఎవడూ రాడుదొరా

మేమంతా నీకు - తోడుదొరా సాహోరే - ఏ.ఏ.ఏ
సాహూరే - మా యోరే! అన్న దమ్ములుగ -
అంతాకలిసి - తెచ్చిన దేదో - పంచుకు తింటాం
//కన్నయ్యా//

చరణం 3: దొంగలమా - మనం దొంగలమా!
ఒకరి నింకొకరు - దోపిడి చేసి

మేడలు, మిద్దెలు - కట్టే వాళ్ళను
దొరలంటారు - వాళ్ళను - దొరలంటారు
ఓహోయా

వాళ్ళను దొరలంటారు కాలం రా
కాలంరా - చెడు కాలంరా
ఎదిరించడమే - మన న్యాయంరా

రాళ్ళను రువ్వే ఈ లోకంలో - మనమే-
మనకుసాయంరా సాహూరే - మాయోరే ॥కన్నయ్య॥

**చరణం 4:** ఆడుచు పాడుచు - అడవి పిట్టలై
హాయిగ బతికే వాళ్ళం - చీకూ
చింతా ఎరగని వాళ్ళం
ఎవరేమన్నా ఖాతరు చెయ్యం
ఆడు దొరా - వేటాడు దొరా

ఎర్రగ నువ్వు చూశావంటే
ఎదురే ఎవడూ రాడుదొరా

పుట్టుకతోనె తెస్తిమికాదా
ఎప్పటికైనా చచ్చేహక్కు
చంపడమన్నా - చావడమన్నా
జంకక పోతే - లేదుర చిక్కు
ఆడు దొరా - వేటాడు దొరా ॥కన్నయ్య॥

---

"బందిపోటు దొంగ" చిత్రంలోని దీపాట.

సంగీతం : ప్రసాదరావు, రామారావు
పాడినవారు : **ఘంటసాల, పి. సుశీల బృందం**

ఎర్రగనువ్వు చూశావంటే అన్నలైను తల్చుకుంటే గతం జ్ఞాపకం వస్తోంది. శ్రీశ్రీ ఎరుపంటే ఎంత ఉద్వేగమో, ఉత్సాహమో నేను వేరే చెప్పక్కర్లేదు. వారికి రంగులలో ఆకుపచ్చ అంటే చాలా యిష్టం. నేను ఎప్పుడైనా చీరకొనుక్కోమని అంటే ఆకుపచ్చరంగు చీరకొనుక్కోవే అమ్మీ - అనేవారు.

# పదండి ముందుకు!!

పల్లవి: పదండి ముందుకు
పదండి తోసుకు

కదం తొక్కుతూ – కదలండి
స్వరాజ్యమే మన జన్మహక్కనీ

సమస్త జగతికి చాటండి
భారత వీర ప్రజలారా

స్వరాజ్య వాదీ ధరించు ఖాదీ
పరాయి సరుకులు మనకేలా

రాటమున వడకే వారే
పోరాటములోన వడకరులే ॥పదండి॥

అనుపల్లవి: అహింసయే మన ఆయుధమూ
సత్యాగ్రహమే సాధనమూ

త్రివర్ణ సుందర పతాకము
భారత దాస్య విమోచనము

ప్రేమా శాంతీ ధర్మం నిండిన
రామ రాజ్యమే మన ఆశయమూ ॥పదండి॥

1వ చరణం: కల్లు మానండోయ్ బాబయ్యా
కళ్లు తెరచి సాగి రారయ్య బాబయ్యా

కాపరాలను కూల్చురాకాసిరా
కన్నీళ్లు కష్టాలు తెచ్చురా

మంచి తనమే చంపి

మమతలే తెగతెంపి
మనల పశువుల చేయు
మహామారిరా ||పదండి||

2వ చరణం: తరతరాల దురన్యాయాలకు
గురియై బలియై
దరికానరాని వారీ
దరిద్ర నారాయణులూ
హరిజనులు-

సాటిమనిషిని - దూరంచేసే జనులు
మోక్షం కనలేరసలు

సమాజమంతా - సమానమైతే
నాడే జాతికి - నవజీవనము ||పదండి||

3వ చరణం: ఈ భూమి మాభూమిరా
ఇది బంగారు మాగాణిరా

పన్నులెన్నో వేసి - పంట సిరులను దోచి
మాతల్లి నేలకే - మమ్ముదూరమ్ము చేయు

దుష్టపరిపాలనకు - స్వస్తియీనాడే
పన్నుల నిరాకరణ - ప్రారంభమాయె

పదండి ముందుకు - పదండి తోసుకు
కదంతొక్కుతూ కదలండీ

స్వరాజ్యమే - మన జన్మహక్కనీ
సమస్త జగతికి చాటండి

తెలుగు దేశ వీరులారా
భరత దేశ పౌరులారా ||పదండి||

★ ★ ★